ప్రపంచములో పెద్దరాతి ఆనకట్టలలో నొకటగు మెట్టూరు ఆనకట్ట రిజర్వాయరు. మద్రాసు రాష్ట్రంలో కావేరి నదిపై సేలంకుపడమరగా 32 మైళ్లలోనున్నది. దీని విద్యుత్ కర్మాగారం, రిజర్వాయరు ఏర్పాటైనవి.



కులూ లోయయందలి ఒక గ్రామపంచాయతి సమావేశదృశ్యము.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# స్వవిషయం



మా గృహలక్ష్మి 1928 సంవత్సరములో పూజ్యులు డా॥ కే. యన్. కేసరి గారు స్థాపించి నిర్వహించ పూనుకున్నారు. ఈ నాటికిది 29వ సంపుటములో ప్రథమ సంచిక.

గృహలక్ష్మి ముఖ్యంగా మహిళాభ్యుదయమును ప్రోత్సహించడానికి ఏర్పడి ఆ నాటినుండి యీనాటివరకు మహిళాభ్యుదయంతోబాటు జాతీయ శ్రేయోసౌభాగ్యములను సయితము ప్రోత్సహించుచున్నదను విషయము మీకందరకును తెలియును.

రాజకీయ, సాంఘికరంగాలలో మహిళ అభ్యున్నతికి గృహలక్ష్మి చేసిన కృషి అపారము. విద్యావిజ్ఞానాలవ్యాప్తికి, లలితకళల ప్రోత్సాహమునకు గృహలక్ష్మి అనేక విధాల తోడ్పడుతూ వచ్చింది. ఉత్తమ రచయిత్రులు, కవయిత్రులు గృహలక్ష్మిద్వారా

అనేకమంది రూపొందారు. గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము అనేకమంది కవయిత్రులను, కళాకారులను ప్రోత్సహించినది.

గృహలక్ష్మిలో నిరంతరము అభ్యుదయ రచనలకు ప్రోత్సాహముంటుంది. అయితే రచనలు పరిశోధనా పూర్వకంగా విద్యావిజ్ఞానముల వ్యాప్తికి తోడ్పడునవిగా యుండవలెను. రచనలు ఉత్తమ ఆదర్శలక్ష్యాలతో కూడుకొనియుండునవై యుండినచో ప్రజోపయుక్తంగా నుండగలవు. సాధ్యమైనంతవరకు రచనలు ముద్రణలో ఆరు పేజీలకు మించనవిగానున్నచో త్వరగా ప్రచురణ కవకాశముండును.

ఈ నాటి పరిస్థితులలో ప్రజావసరాలకు సంబంధించిన వ్యాసములను ఆహ్వానిస్తున్నాము.

ఎప్పటియట్లు పత్రికానిర్వహణలో మీ సహాయసహకారములు, ఆదరాభిమానములు లభించగలవని ఆశిస్తున్నాము. ఇంతకాలము మీ అభిమాన వాత్సల్యములతో వర్ధిల్లిన గృహలక్ష్మి యికముందు సయితము జాతీయశ్రేయస్సును ప్రోత్సహించడములో కృషిచేయ నాసక్తి కలిగియున్నది.

సంక్రాంతి పర్వదిన సందర్భమున మిమ్ములనందరను హృదయ పూర్వకంగా అభినందించుచున్నాము.



# అభినందనలు



శ్రీ నీలం సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెస్‌కు అధ్యక్షుడు కావడంతో ముఖ్యమంత్రి ఎవరు కానున్నారనే యూహాగానము పలుపలువిధాల బయలుదేరింది. రాష్ట్ర అసెంబ్లీ కాంగ్రెస్ పార్టీ నాయకత్వానికి ఏకగ్రీవమైన ఎన్నికసాధ్యంకాదేమోనని పించింది. కాని చిట్టచివరకు శ్రీ సంజీవరెడ్డిగారి కృషిఫలితంగా శ్రీ దామోదరం సంజీవయ్య రాష్ట్ర అసెంబ్లీ కాంగ్రెస్ పార్టీకి నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. ఆయనే ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి.

శ్రీ సంజీవయ్యగారిని యీ సందర్భమున హృదయపూర్వకంగా నభినందిస్తూ, యువకుడు, చిత్తశుద్ధికి, శక్తిసామర్థ్యాలకు, కార్యదక్షతకు పేరొందిన ఆయన ఆంధ్ర దేశంలో అభివృద్ధి అభ్యుదయాలను సమరసస్మైక్యతలను పెంపొందింప చేయగలరని ఆశిస్తున్నాము.



# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోనిడె సయంట్-ఎక్సుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## ఇంతవరకు సాగిన కథ

[కథకు మూల విరాట్ అబ్బాయి. అబ్బాయిని రాజకుమార్ అని రచయిత పేర్కొంటాడు. రాజకుమార్ లోకం మనం కనీ వినీ ఎరగని నక్షత్రమండలం. రచయిత ఆకాశ విమానాలని నడపటంలో సిద్ధహస్తుడు. ఒకసారి ఆయన యంత్రం చెడిపోయింది. బ్రహ్మాండమైన ఎడారిలో యంత్రాన్ని మరమ్మత్తు చేసుకోటానికి ఆయన క్రిందికి రావాలసివచ్చింది. మరమ్మత్తులో సతమతమైపోతున్న సమయంలోనే అబ్బాయి తన లోకంనుంచి ఆయన ముందు ప్రత్యక్ష మయ్యాడు. కలుపుగోలు పిల్లవాడు రాజకుమార్. అంచేత ఆయనతో స్నేహం చేసుకోటానికి ఏమాత్రమూ కష్టమనిపించింది కాదు. అబ్బాయికి కబుర్లు చెప్పటమంటే సరదా. అన్నీ అబ్బాయి ఇతర నక్షత్ర మండలాల్లో సంచారం చేస్తూవున్నప్పుడూ, ఇప్పుడు ఈ లోకంలో అడుగెట్టి, ఆయన దగ్గరకు వచ్చేటంతవరకూ ఎదుర్కొన్న సంఘటనలకు సంబంధించినవే. ఆ సంఘటనలకు సంబంధించిన వివరాలను ఇంతవరకు మనం చదివాము. ఇకముందు కథ ఎలా సాగిపోతుందో చూద్దాం రండి!]

నా ప్లేను చెడిపోయి నేను ఈ ఎడారి మధ్యని దిగిపోయి ఇప్పటికి వారం రోజులయింది. ప్లేనుని మరమ్మత్తు చేసుకోటానికి ఈ రోజుల్లో శాయశక్తులా ప్రయత్నం చేస్తూనే వున్నాను. ఆ సమయంలో రాజకుమార్ చెబుతూవున్న కథలను వింటూ వూగొడుతూవున్నాను కూడా! తోలుబుడ్డిలో తాగటానికి జాగ్రత్తపరుచుకున్న నీరంతా అయిపోతున్నది. అబ్బాయి మందులమక్షి కథను చెబుతూ వున్న సమయంలోనే కడపటి బొట్లను ఖాళీ చేయబోతూవున్నాను. అబ్బాయి కేసి ఒకసారి ఆదుర్దాతో చూస్తూ "అబ్బాయి! నువ్వు చెబుతూవున్న ఆ సంఘటన బాగానేవుంది ... కాని నా ఇంజన్ ఇంకా బాగుపడలేదు. దీనికోసం ఇంకా ఎంతకాలం తికమక పడాలసి వస్తుందో! జాగ్రత్తపరచుకున్న మంచి నీరు అయిపోయింది. నీరు నింపుకోటానికి ఈ క్షణాన్నే నూతి కేసి వెళ్లాలసివస్తుంది! ఆ పనిపూర్తి చేసుకున్నాక తరువాతి కథలు చెప్పవచ్చు. ఏమంటావు?" అని అన్నాను.

"నా నేస్తం నక్క..." అని అబ్బాయి ఏదో చెప్పబోతున్నాడు.

వాడి మాటకు అడ్డువస్తూ "ఇదిగో అబ్బాయి! నక్క గిక్కల సంగతి ఎందుకు చెప్పు ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లో..." అని అన్నాను.

"ఎందుకలా అడ్డురావటం?" అని బుంగముఖం వేసుకుని అబ్బాయి అన్నాడు

"ఎందుకా? చావు బ్రతుకుల్లో వున్న నాకు అలాంటి కథలను చెప్పితే లాభం వుంటుందా...?" అని అసలు సంగతి వాడికి చెప్పటానికి ప్రయత్నం చేశాను.

నేనిలా వాడి మాటకు అడ్డురావటం

వాడికి సనేమిరా ఇష్టంలేదు. తన ధోరణిలో "చావు బ్రతుకుల్లో కూడా స్నేహితుడు అనేవాడు ఒకడు వుండటం చాలా అవసరం. నాకు అలాటి చెలికాడు వున్నాడు. వాడే ఆ నక్ష...'' అని ఏమో అనబోతున్నాడు.

చావు బ్రతుకులు అంటే అబ్బాయికి ఏం తెలుసు? అలా తెలుస్తే ఇలా అనవసరపు కబుర్లకు దిగుతాడా? వాడు ఈ లోకపు వాడయితే ఆకలి అంటే ఏమిటో దాహం అంటే ఏమిటో అర్థమవుతుంది. వాడికి కావాలిసింది ఎండ. దాంతో వుబ్బి తబ్బిబ్బయి పోవటం మాత్రం వాడికి బాగా తెలుసు....

ఇలా ఆలోచనా లోకంలో నేనుమునిగి తేలుతూ వుండటం అబ్బాయి బాగా అవగాహనం చేసుకున్నాడు. చటుక్కున తను చెప్పబోయే కథను ఆపేసి నాకేసి అతృతతో చూస్తూ "నీకుమల్లె నాకూ దప్పిగా వుంది. ఈ ప్రాంతాలలో నుయ్యి ఎక్కడ వుందో చూడటానికి ఈ క్షణాన్నే బయలుదేటం మంచిది ఏమంటావు?'' అని అన్నాడు...

సరేనంటూ, చేస్తున్న పనిని చప్పున ఆపేసి అబ్బాయిని వెంటబెట్టుకుని నుయ్యిని వెదకటానికి బయలుదేరాను. ఆ ఎడారి నాకు కొత్తది. నుయ్యి ఎక్కడ వుందో తెలుసుకోటం అంత సులభమైన పని అయితేగా! ఎలాగయితేనేం, సాహసంచేసి ఆ దరా బా దరా ముందుకు నడుస్తూ వున్నాం...

ఎంతదూరం నడిచినా నుయ్యి మాకు కనబడితేగా! మిట్టమధ్యాహ్నం బయలుదేరిన వాళ్లం సూర్యాస్తమయమైనా మా పనిని సాధించలేకపోయాం. సూర్యాస్తమయంతో ఆకాశమండలంలో ఎటు చూసినా నక్షత్రాలే! ఒకటా రెండా? వందలకొలది! వేలకొలది నక్షత్రాలు! వాటి మూలాన. ఈ లోకపు దృశ్యమే చాలవరకు మారిపోయిందనే చెప్పవచ్చు

అలసి సొలసి వున్నాను. జ్వరం వచ్చే లక్షణాలూ బాగానే కనబడుతూ వున్నాయి. జలం లభించిందా ఈ యాతన అంతా మాయమై వుండేది! నక్షత్రాల వెలుతురుని తనివితీరా చూస్తూ, అన్ని కష్టాలని మరచి వుండేవాడిని!...

అబ్బాయి నిజంగా కాలాంతకుడు. నా మనోభావాలని వాడు చటుక్కున అర్థం చేసుకున్నాడు. నాకేసి ఎంతో జాలితో చూస్తూ "నీకూ దాహమవుతున్నదా?'' అని అంటూ "ఇలాటి పరిస్థితులలో నీరు అన్ని బాధలను మాయంచేస్తుంది...'' అని ఏమో అంటున్నాడు. నా అనోమయావస్థలో వాడు చెప్పేది వినేస్థితిలో లేను. ఏం మాట్లాడకుండా వూరక వుండిపోయాను అంతకన్నా మరేం చేయగలుగుతాను? ...

నాకుమల్లె అబ్బాయికూడా బాగా అలసిపోయి వున్నాడు. ఇంతవరకూ హుషారుగా కబుర్లు చెబుతూ వున్నవాడు నాకు చేరువగానే వచ్చి కూచున్నాడు. కొంచెం సేపు ఏమీ మాటాడినవాడు కాదు. తరువాత వాడి బుర్రలో ఏం తట్టిందో, నాకేసి తదేకంగా చూస్తూ "నక్షత్రాలు ధగధగ మెరుస్తూ వున్నాయి కదూ!...వాటిని

చూస్తూవుంటే నా వువ్వుసంగతి జ్ఞాపకం వస్తున్నది. పాపం నా వువ్వు ఇప్పుడు ఎలా వుందో.. '' అని గొణగసాగాడు. 'వూ' అంటూ తల వూపాను.

''ఒక్క నక్షత్రాలే కాదు. ఎడారి కూడా నాకు బాగా నచ్చింది...'' అని ఇంకా ఏమేమో చెప్పటానికి ప్రారంభించాడు. . ''

అబ్బాయి అన్నది అక్షరాలా నిజమే. నాకుకూడా ఎడారి అంటే పంచప్రాణాలూ లేచివస్తాయి. ఎడారికి ఆద్యంతాలు అనేవి వుంటేగా ఇలాటి ప్రదేశంలో. ఎటు చూసినా ఇసక కొండలు, వాటికవతల ఏం వున్నాయో ఎవళ్లకు తెలుసు? అంతా నిశ్శబ్దం. అదీ మనం సామాన్యంగా అనుకుండే నిశ్శబ్దం వంటిది అయితేగా! ఆ నిశ్శబ్దంలోనుంచి వచ్చే వాతావరణం ఇంద్రజాలం, మహేంద్రజాలంకంటే అతీతమైంది ...''

''ఎడారికి మన కష్టనిష్ఠురాలు బాగా తెలుసు. మనకోసం ఒక మంచి నూతిని తయారుచేసే వుంటుంది. కొంచెం వోపిక పట్టి మరికొంత దూరం నడిచామా, ఎడారి మనకోసం తయారుగా వుంచిన నూతిని ఎలాటి కష్టంలేకుండా కనుక్కోవచ్చు....'' అని అబ్బాయి ఎడారి శక్తిసంపదలని ఆపళాన చెప్పటానికి మొదలెట్టాడు.

ఎడారి రహస్యం నాకు బాగా తెలుసు. అబ్బాయికి ఇదంతా ఎలా తెలిసిపోయిందా అని వాడి మాటలను వింటూ విస్తుపోతూ వున్నాను.....వాడి వయస్సులో వున్న రోజుల్లో మా వాళ్లతో ఒక పాత ఇంటిలో కొంతకాలం వుండాలసి వచ్చింది. ఆ ఇంటికి సంబంధించిన అద్భుతమైన గాథ ఒకటి వుండేది. పూర్వం ఆ ఇంటిని కట్టిన వాళ్లు దాన్లో ఒక సువర్ణభాండాన్ని దాచారట. దాన్ని పరాయి వాళ్లెవళ్లూ కనిపెట్టటం బ్రహ్మాండమట. ఆ సంగతి తెలిసే ఎవళ్లూ ఇంతవరకూ దానికోసం ప్రయత్నం చేయలేదట! ఆ వస్తువును దాచినాయనకు ఇంద్రజాలం బాగా తెలిసి వుండాలి. దాంతోనే ఆ వస్తువుని ఇలా ఇంతకాలం దాయకలిగి వుండాలి.

''అవును అబ్బాయి! నువ్వు అన్నది నిజమే. ఏది అందమైంది అని మనం అనుకుంటామో అది నిజంగా అందమైందే, దాని అందాన్ని అది పైకి వెలిబుచ్చక పోయినా!'' అని వాడితో అన్నాను.

నా యీమాటకు అబ్బాయి వుప్పొంగిపోతూ ''నక్క కూడా అలాగే అంది. నువ్వుకూడా అలా అనటంచూస్తే నక్క అన్నమాట నిజమై వుండాలి'' అని అన్నాడు.......

అక్కడ ఎంతసేపు కూర్చున్నామో ఇక మాటలతో వివరించటం అనవసరము. ఈ ప్రశాంత వాతావరణంలో బడలికంతా మాయమైపోయింది. ఇక అబ్బాయా - వాడు హాయిగా నిద్రపోతున్నాడు. ఎంతసేపని ఇక అక్కడ వుండిపోవటం? వచ్చిన పని చూసుకోటం ముఖ్యం. అబ్బాయిని ఎత్తుకుని ముందుకు నడవసాగాను. ఆ ప్రశాంత వాతావరణం ఆ నక్షత్రాల దివ్యకాంతుల సహాయంతో, వాటికి కాంతులకు వెయ్యింతల కాంతిని

(44వ పేజీ చూడుడు)

# వేదవాఙ్మయంలో స్త్రీలు

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

మన ప్రస్తుత స్త్రీ సమస్యల విషయమై చర్చించుటకు పూర్వము మనదేశమందనాదిగా వస్తూఉన్న వేద వాఙ్మయములో స్త్రీల స్థితి యెట్లుండెడిదో టూకీగానైనా తెలుసుకొనుట యవసరము.

వేదకాలములోనైతేనేమి, మన సనాతన సంప్రదాయములోనైతేనేమి, అసలు పురుష శబ్దానికి భర్త, భార్య, బిడ్డ, ముగ్గురూ కలసినదే పురుషుడని అర్థం చెప్పుతారు. అనగా భార్యాబిడ్డలతో కలసిన సంపూర్ణ గృహస్థురూపమే "పురుష" స్వరూపమన్నమాట.

అట్టి పురుషునియొక్క జీవితాశయములుగ నియమించబడిన ధర్మార్థ కామ మోక్షములు స్త్రీ పురుష ఉభయులకు సమానముగనే వర్తించేవి. అందు ముఖ్యముగా ధర్మాభిలాషులగు మన దేశీయులలో భర్త యేపనిచేసినా "ధర్మపత్నీ సమేతస్య" అని భార్యనుకూడా ఉంచుకోవడం యిప్పటికీ ఆచారంగా వస్తూ ఉంది.

వేదఋషులలో గార్గి, మైత్రేయి మున్నగు నారీమణులుండినట్లగుపడుతుంది. కాని మొత్తంమీద మగఋషులే చాలా హెచ్చుగా నుండేవారు. ఇదే విధంగానే ఆర్య విధులలో ముక్తిప్రదమైన యజ్ఞయాగాది క్రతువులలోకూడా స్త్రీకి స్థానం నిరాకరించబడకపోయినా, సోమిదేవమ్మ సోమయాజులుగారి ప్రక్క కేవలం ఒక ఛాయారూపంగా మాత్రమే ఉన్నట్టు తోస్తుంది.

కాని మొత్తంమీద వేదకాలంలో స్త్రీలకు పురుషునిపై ప్రత్యేక అధిక్యత యేదీ లేకపోయినప్పటికీ, నేటి మన భారత స్త్రీ సమాజమునందలి పెక్కు దోషములు ఆ కాలపు స్త్రీలలో నుండినటుల తోచదు. స్త్రీకి సంఘములో గౌరవస్థానమే యున్నటులగుపడును.

వేదసారమునంతను సూత్రరూపేణా క్రోడీకరించి శాసించినవాడు మనువు. మనుధర్మశాస్త్రం నాటికే మన సంఘములో మగవాని చెయ్యి పైకివచ్చి, స్త్రీ తక్కువ శ్రేణికి పోయినట్లగుపడుతుంది. అయినప్పటికీ మన సంఘంలో స్త్రీలను సగౌరవంగా చూడ్డం అంతవసరమని మనువు పదేపదే చెప్పేడు. స్త్రీ కన్నీరు కారిస్తే కుటుంబానికి కీడనీ; స్త్రీ యెక్కడైతే సంతోషంగా నుంటుందో, అక్కడ దేవతలంతా సంతోషిస్తారనీ; అందుచేత పురుషులు తమ స్త్రీలను రంగురంగుల చీరలతోను, విలువగల ఆభరణాలతోను సంతోషపెట్టవలసినదనిన్నీ, మనువుయొక్క శాసనం. కాని ఆస్తి హక్కులలో మాత్రం స్త్రీకి వ్యక్తిత్వం చాలాభాగం పోయింది. వివాహాదులలో "అష్టవర్షాద్భవేత్ కన్యా" అవతరించింది.

ఈ వివాహాల సందర్భములో మరొక్కమాట. వేదకాలములోగాని, తదనంతరంకాని, చాలకాలం వరకు మనదేశంలో అతి బాల్యవివాహాలు ఉన్నట్టు అగుపడదు. ఇక బాల్యవివాహాలైనా ఒక్క బ్రాహ్మణులలోను, వారినిబట్టి వైశ్యులలోను ఆచారమైనట్లగుపడుతుంది. క్షత్రియ స్త్రీలకు ప్రౌఢవివాహములే "రూలు". స్వయంవరములు వీరిలో అత్యుత్తమ స్త్రీలకు ఉండేవి. శూద్రాదులలో దాదాపు అన్నీ ప్రౌఢ వివాహాలే. మొత్తంమీద చెప్పాలంటే, హిందూవివాహములు యిప్పటి "హిందూ లా"లో వలె బ్రాహ్మ, పైశాచీ అనే రెండు పద్ధతులే కాకుండా, గంధర్వ, రాక్షసాది యెనిమిది రకములైన వివాహములుండేవి. ఇట్లాగే, శూద్రాదులలో మారుమనువు సామాన్య ధర్మమైనట్లగుపడుతుంది. సర్వసాధారణంగా ఏకపత్నీవ్రతం సామాన్యమానవ ధర్మమైనప్పటికీ, ముఖ్యంగా భూపతిత్వ సంప్రదాయంలో బహు పత్నీత్వమున్ను, టిబెట్, కాంధహార్ మున్నగు ప్రాంతాలలో కొద్ది చోట్ల మాత్రము బహుపతిత్వమున్న, ఆచారముగానున్నట్లగుపడుతుంది. ఆ రోజులలో స్త్రీ పురుష ఉభయులు సంపూర్ణాయుష్కులగుటచేత, యీ రోజులలోవలె లక్షలాది, కోట్లాది విధవ స్త్రీల సమస్యయే యుండెడిది కాదు. కుటుంబములన్నీ ఉమ్మడి కుటుంబములగుటచేత వ్యక్తి హక్కులకీ, ఈర్ష్యాసూయలకీ అట్టే స్థానమున్నట్టును అగుపడదు.

ఇంకో చిత్రం. ఈ ఏకపత్నీత్వ, బహుపత్నీత్వములు కాలానుగుణ్యముగా మారినట్లు, స్మృతికారులు మార్చినట్లు, అగుపడుతుంది. ఉదాహరణ:

ఇక్ష్వాకువంశంలో బహుపత్నీత్వం సామాన్యధర్మం. వారిలో ఇక్ష్వాకు కాబోలు - నూరుగురు భార్య లుండేవారట. రాముని తండ్రి దశరథునకు ముగ్గురు భార్యలు - కౌసల్య, కైకేయి, సుమిత్ర - మన మెఱుగుదుము, వీరుగాక యింకా కొంతమందికూడా ఉండేవారట. అట్లాంటి వంశములో పుట్టిన శ్రీరామ చంద్రమూర్తి మాత్రం గాఢమగు ఏకపత్నీ వ్రతస్థు డైయేడు. తుదకు ఆ భార్యను అడవిపాలు చేసినప్పు డైనా యింకో రాణీగారిని ఆ మహానుభావుడు స్వీక రించలేదు. ఇందుకు మారుగా ద్వాపరాంతమున, కలి ప్రారంభంలో అవతరించిన శ్రీకృష్ణమూర్తి అష్ట మహాదేవులు, పదహారు వేలమంది గోపికా స్త్రీలతో లీలాలోలుడై వెలిసేడు.

ఇంత భిన్నాచారాల కారణం యేమై ఉంటుంది? అని ఆలోచిస్తే, వీటన్నిటికీ మూలసూత్రాలు మనకు బోధపడకమానవు.

ఉదా: శ్రీరామచంద్రమూర్తి అవతరించేనాటికి దేశమంతా శాంతిరాజ్యంగా ఉండేది. ఆ రోజులలో జరిగిన ఒక్క యుద్ధమూ యెక్కడో దూరాన ఉన్న రావణాసురుని లంకలో జరిగింది. భారత ఖండ మంతా "సుజలాం, సుఫలాం, మలయజ సీతలాం, సస్యశ్యామలాం"గా ఉంది. అట్లాంటప్పుడు బహు పత్నీత్వం ప్రజాధర్మం కాకూడదని శ్రీరామచంద్రుల మతమై యుండాలి. కాని ద్వాపరాంతంలో ఒక్క మహాభారత యుద్ధంలోనే 18 అక్షౌహిణుల (అంటే రమారమి 40 లక్షల (పురుష)సైన్యం నశిస్తే, అప్పటి సంఘములో శేషించే కొద్దిపాటి పురుషులకి, అసం ఖ్యాకమగు స్త్రీలకి ఎల్లాంటి వైవాహిక సంబంధం యేర్పడాలి? ఒకటి, ఒకటి సంబంధమా? లేక ఒకటి, పదహారువేల సంబంధమా? ఇది కేవలం గణితశాస్త్ర సూత్రమే అంటాను. అల్లాటప్పుడు శ్రీకృష్ణమూర్తి బహుపత్నీ వ్రతస్థుడగుటలో ఆశ్చర్య మేముంది?

శ్రీకృష్ణుడు కేవలం భారత యుద్ధవీరుడు మాత్రమే కాదు. అతడు 4,32,000 సంవత్సరములు జరుగ వలసిన కలియుగానికంతకీ అదర్శపురుషుడు - యుగ ప్రభువు.

కలియుగంబునందు ధర్మువు ।
బలమరి వర్తించు నేకపాదంబునను ।
దలఘుడు కృష్ణుడు జగతీ ।
వలయము రక్షించు బీనవర్ణుండగుచున్ ॥

అని భారత వాక్యం. కేశవ నామములలో యాతని నామమును 24వ తత్వముగా జేర్చినారు - మన పూర్వులు - కలియుగమునే కృష్ణయుగమని శాసించి నారు. తుదకు శ్రీకృష్ణుడే బ్రహ్మణ్యుడనియు, అతడే జగద్గురుడనియుగూడ మనల కుపదేశించారు. అట్టితరి అతని ఆచారమును కాలానుగుణ్యముగ బరిశీలించుట యవసరము.

ఈ వ్యవహారములో యింకొక తిరుగుడును అగు పడుచున్నది. శ్రీకృష్ణుని యనంతర మీ ప్రపంచమున వెలసిన మహమ్మదు ప్రవక్త తన ఆత్మీయులకు బహు పత్నీత్వమునే ఉపదేశించెను. నల్గురు భార్యలు, పై పెచ్చు వలయునంతమంది ప్రియురాండ్రు, ఇదీ యాతని "షరయత్" మతము. తదనుగుణ్యముగ ప్రపంచమందన్ని దేశములలో, మన దేశమందుగూడ, గత 12,13 వందల యేండ్లలో, ఇస్లామ్ మతస్థులు యితర సంఘీయుల నీబహుపత్నీత్వము ద్వారా యెన్ని కోట్లుగ వృద్ధిజెందిరో? ఇతర మతస్థుల నే రీతిగ క్షీణింపజేసిరో? ఎల్లరెఱింగిన విషయమే. ఇట్టి పరిస్థితి నెదుర్కొనుటకు అర్హులగు వారిలో శ్రీకృష్ణోపాసనయే తగిన ప్రక్రియ కాదని యెవ్వరన గలరు?

యజ్ఞయాగాదులతో పాటు వైదిక పద్ధతిలో ఆశ్రమపద్ధతిగూడ యుండెడిది. కాని ఆ కాలమందు స్త్రీలకు సన్యాసాధికార మొసంగబడినట్లుగ పడదు. దీనివల్లనే బౌద్ధ కాలమున బుద్ధుడు స్త్రీలకు "సంఘా"ధికార మొసంగుటయు, తద్ద్వారా స్త్రీలు అసంఖ్యాకముగ బౌద్ధ సంఘములలో జేరిపోవుటయు తటస్థించినది.

అతి బాల్యవివాహములు చాలవరకు యిటీవల ముస్లిమ్ ప్రాబల్య కాలములోనే యెక్కువగ వెలసి నట్లుగుపడును. వివాహితులగు స్త్రీలను ముసల్మా నులు "నిఖా" చేయగూడదను నియమమే యీ నూతనాచారమునకు ముఖ్యకారణము. "బొమ్మల పెండ్లిండ్ల" వలె యీ అతి బాల్యవివాహములు పెద్ద లకు చూడముచ్చటగా నుండుటయందలి వినోద హేతువుగ బరిణమించెను.

ఇటీవల శాసించబడిన పరాశరస్మృతిలో అప్ప టికి ప్రబలిన కొన్ని దురాచారములు కొంతవరకు సవరింపబడుటకు యత్నములు జరిగినవి. ఉదహారణ: విధవలగు స్త్రీలకు "ముండన" విధి కొన్నికొన్ని

లము సందర్భలో సడలింపబడినది. దానికి ప్రాయశ్చిత్తము — "వ్రతమ్ ద్విగుణమాచరేత్" - రెండు సార్లు గౌరీపూజయో, లేక లక్ష్మీపూజయో. మహారాణి ఝాన్సీలక్ష్మీబాయి ఈ విధముగ యొనర్చినటుల చరిత్ర తెల్పుచున్నది. ఇటులనే పురుషులకు "యదహ్నాత్కురుతే పాపమ్ తదహ్నాత్ ప్రతిముచ్ఛతే" అన్నట్లు, ప్రతి నెలయును ఋతుస్నానములో స్త్రీ దోషములన్నియు పరిహారమగునని పరాశరుడు పల్కెను. బలాత్కారముగ అన్యమతమందు జేర్చిన స్త్రీలను తిరిగి స్వీయమతమందు జేర్చుకొనుటకును పరాశరుడు మార్గము జూపెను. ఈ రీతిగ స్మృతికారులు యుగానుసరణముగ సంఘ సంస్కరణకై - స్త్రీ యభ్యుదయమునకును — వలయు మార్పులను కొన్నింటిని సూచించుచు వచ్చిరి.

కలియుగములో విశేషముగ ప్రబలిన "తాంత్రిక" సాధనలో స్త్రీకి ప్రత్యేక స్థానమొసంగబడినది. అసలీ విద్యనే స్త్రీ విద్య లేక శక్త్యుపాసన యని వీరు పేరిడిరి. ఇందుపాస్యదేవత లెక్కుడుగ దేవతలే. స్త్రీ పురుష జోడీలలో — సీతారాములు, రాధాకృష్ణులు, ఉమామహేశ్వరులు, యీ రీతిగ ముందు స్త్రీ నామమును, తదుపరి మాత్రమే పురుషుని పేరును ఉచ్ఛరింపదగుననియు, ఇందుకు మారుగ పురుషుని పేరు ముందు చెప్పినచో కుంభీపాక నరకమునకు పోవుదురనియు మంత్రశాస్త్రము శాసించుచున్నది.

యాతావాత:— వైదిక వాఙ్మయములో స్త్రీల స్థితి యిప్పటంత అధ్వాన్నస్థితిగ నుండెడిది కాదు. పిడికకు, బియ్యమునకు, ఒకే మంత్రమున్నటుల గాక, వివిధ ప్రకృతులకు భిన్నరీతులు, భిన్నాచారములు శాసించబడి యుండెడివి. కాలానుగుణ్యముగ కొన్ని మార్పులను స్మృతికారులు అప్పుడప్పుడు చేయుచునే వచ్చిరి. ఈ మార్పులన్నియు ఆయా కాలములకు సరిపడినవా? ఇప్పటి పరిస్థితులను ఆ స్మృతులన్నియు యెదుర్కొనగలవా? యను ప్రశ్న లిచ్చట అనవసరము, అప్రస్తుతము.

ఇంకొక్క విషయము — భారతవాఙ్మయములో త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో పాటు సరస్వతీ, లక్ష్మీ, పార్వతులకు సమాన గౌరవ ప్రతిష్ఠలే ఈయబడినవి. విద్యాదేవత సరస్వతి — ఐశ్వర్యప్రదాత లక్ష్మీదేవి — శక్తిమూర్తి యీశ్వర పత్ని. ఇంతేకాక, యిటీవల మనదేశ దౌర్భాగ్య వశాత్తు, బ్రహ్మకైనను పూజార్హత పోయినది కాని (యిప్పుడా శాపవిమోచన అయిపోయింది లెండి!) సరస్వతి మాత్రము యెల్లరకును ఉపాస్య దేవతయే. అట్టి విద్యాదేవిని "సరస్వతే నమస్తుభ్యం" అని ప్రప్రథమమున ఉపాసించని విద్యార్థుల నెవ్వరను మనమిచ్చట గానము.

ఇట్టి సంప్రదాయములలో పుట్టి పెరిగిన మన నారీలోకమిప్పు డేస్థితిలోకి వచ్చెనో మనము ముమ్ముందు ప్రకరణములలో బరిశీలించెదము.



# భక్తియోగ ప్రశ్నోత్తరి

మూలము :
"అవతార్"
శ్రీ శివానంద భగవాన్

★

అనువాదము :
"శివానంద పాదసేవక్"
శ్రీ స్వామి శ్రీసివాసానంద సరస్వతి

14. దివ్యామృత మెచ్చట నున్నది ?

విద్వజ్జనులు (learned people) అమృతము సముద్రములో చంద్రునిలో పాములయొక్క ప్రపంచము (నాగలోకము)లో, స్వర్గములో గననగునని చెప్పుదురు. ఇది నిజమగుచో సముద్రములో నుప్పదనము (saltishness), చంద్రునిలో క్షయము (decrease) సర్పముల నోళ్ల (mouths)లో విషము యింద్రునియొక్క మరణము [లేక సింహాసన (రాజ్య) చ్యుతి — dethronement] నెటులుండగలవు ? కాబట్టి నిజమగు నమృతము భాగవతుల (భగవంతుని యొక్క భక్తుల) కంఠము (నుడులు లేక బోధలు) లో గననగును.

15. భక్తు లెరుగబడు టెటుల ?

భక్తులు దేనికిని లక్ష్యముచేయరు. వారి హృదయములు భగవంతునియొక్క చరణకమలముల వద్ద లగ్నమొనర్పబడియుండును. వారు చాల నమ్రతగ నుందురు. వారు సమదృష్టి గలిగి యుందురు. వారెవరిపట్లను, నేవస్తువు పట్లను సాసక్తి (ననురాగము) గలిగియుండరు. వారు స్వకీయత్వము (మమత) లేదా నా - త్వము (అహంత — I-ness) లేకుండ నుందురు. దుఃఖము, సుఖముల మధ్య వారు భేదా (distinction) నొందియుండరు. వారితరుల నుండి యేదియు తీసుకొనరు. వారుష్ణము, శీతలత లేక బాధను సహింపజాలుదురు. వారు సర్వప్రాణులు (living beings) కై ప్రేమగలిగి యుందురు. వారు శత్రువుల-గల్గియుండరు. వారు ప్రశాంతముగ నుందురు. వారాదర్శప్రాయమగు శీలమును వహింతురు. భగవానుడగు శ్రీహరి యొక్క నామము సదా వారి పెదవులపై నుండును. వారు చాల భక్తిగ నుందురు. వారు శ్రీహరిని సర్వజీవుల వస్తువులలోను చూతురు. వారన్యుల మనోభావముల (feelings) నెన్నడును హానిచేయరు. వారు సర్వులయెడ మైత్రిగ నుందురు. వారు కోపము, ద్వేషము, గర్వము నుండి విముక్తులుగ నుందురు.

16. భక్తిని పెంపొందించు మార్గములో నిలబడు రెండు ఆంతర్య శత్రువు లెవరు ?

కామము, క్రోధము.

17. కామమును వెంబడించు పది దుర్వ్యసనము (vices) లెవ్వి ?

వేటాడుటయందాసక్తి, జూదము (gambling)- పగటి వేళ నిద్ర, అపనింద వేయుట (slander) ing), దుష్ట స్త్రీలతోడి సాంగత్యము, త్రాగుడు, శృంగార కీర్తనల (love songs) పాడుట, నృత్య మొనర్చుట, అవినీతి (vulgar) స్వభావపు సంగీతము నింకను నుద్దేశ్యహీనమైన తిరుగుటయును.

18. క్రోధము (కోపము) తో సహచరించు నెనిమిది రకముల దుర్గుణము లెవ్వి ?

అన్యాయము, తొందరపాటుతనము, బాధించుట, అసూయ, తిరస్కారము (captiousness), మోసగించుట (అన్యుని యాస్తిని స్వాధీనపరచుకొనుట), పరుషపు (harsh) మాటలు, క్రూరత్వము (cruelty).

19. భక్తియొక్క నెనిమిది చిహ్నము లెవ్వి ?

అశ్రుపాతము (కన్నీళ్లు), పులకము (రోమాంచ మగుట), కంపనము (కండరములదురుట) ఏడ్చుట, నవ్వుట, చెమర్చుట (sweating) మూర్ఛ (సొమ్మసిల్లుట), స్వరభంగము (మాటలాడుట కశక్తితనము) ను.

20. భగవానుడు భక్తుల నెటుల సాయ మొనర్చును ?

శ్రీకృష్ణ ప్రభువే స్వయముగ (తనంతట తానే) నర్సీమ్‌హతా యొక్క కూతురుయొక్క వివాహ మహోత్సవమును జరిపెను. నర్సీయొక్క తల్లి యొక్క శ్రాద్ధముకొరకై భగవానుడగు నాతడు నేయిని గొనితెచ్చెను. ఆ పరాత్పరుడు తన చేతులలో నొకకర్ర గొనుచు నంధుడగు బిల్వ మంగళుని బృందావనమునకు దారిచూపెను. తన మంగలి భక్తునియొక్క హాజరుకాని దినములలో నా భగవానుడు రాజు పాదముల నొత్తెను.

**21. భక్తిమార్గములో నైదు తప్పనిసరి యావశ్యకత లేవి ?**

భక్తి నిష్కామ్య పద్ధతిగ నుండవలయును. అది యత్యభిచారిణిగకూడ నుండవలెను. అది తైల ధార (flow) వలె నెడతెగక నుండవలయును. జిజ్ఞాసువు (మోక్షార్థి) సదాచారము లేక సత్క్రమ ప్రవర్తన నవలంబింపవలయును. అతడు తన భక్తిమయ సాధనలలో చాల, చాల తీవ్రముగ మనఃపూర్వకముగ నుండవలయును. అప్పుడు మాత్రమే భగవంతునియొక్క సాక్షాత్కారము బహుశీఘ్రముగ వచ్చును.

**22. ఏ విధమైన తీవ్రానుష్ఠానమైనను చేయుటెటుల ?**

తెల్లవారుఝామున 4 గంటలకు (4 A.M.) లెండు. మీరు ప్రావీణ్యమొందిననే ఆసనముపైనైన మీ జపమును ప్రారంభింపుడు. ఏ ఆహారము లేక పానీయమును 14 గంటలవరకు గొనకుడు. ఆసనమునుండి పైకి లేవకుడు. మీకు వీలగుచో సూర్యాస్తమయమువరకు మూత్రము పోయుట (విడచుట) నరికట్టుడు. మీరు నిర్వహింపగలిగినచో నాసనమును మార్చకుడు. జపమును సూర్యాస్తమానమున ముగింపుడు. అప్పుడు పాలు, పండ్లను గొనుడు. దానిని సెలవు దినములలో పక్షమున (fortnight) కొకపరి లేదా నెలకొక పరి లేదా వారమున కొకపరి యభ్యసింపుడు.

**23. 40 దినములవరకు ననుష్ఠానమొనర్చుటెటుల ?**

అనుదినము 3000 వంతున రామ, రామ... యొక్క జపమును నొకలక్ష పాతికవేల (125000) పర్యాయము లొనర్పుడు. తెల్లవారుఝామున 4 గంటలకు (4 A.M.) లెండు. జపము సల్పుడు. హృషీకేశము, హరిద్వారము, ప్రయాగ, నాసిక లేక కాశీ లేక బృందావనము లేక అయోధ్య లేక చిత్రకూటమువద్ద ననుష్ఠానము చేయుడు. అటులకానిచో దానిని మీ స్వంతయింటివద్దనే నొనర్పుడు. చివరి యైదు దినములం 4000 (చొ॥న) జపముచేయుడు. ఒకే ఆసనముపై మాత్రమే కూర్చొనుచు నొక లక్ష జపమునుకూడ మీరు ప్రతి దినమును చేయవచ్చును. ఆఖరు రోజు (దివసము)న హవన (హోమ) మొనర్చి, కొందరు బ్రాహ్మణుల, సాధువుల, సన్యాసుల భుజింపజేయుడు.

(సశేషము)

హరిః ఓమ్‌తత్సమ్ !

"Bhakti Yoga Prasnottari"
Instalment II .

# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు

అది భాద్రపదమాస మది కృష్ణపక్ష
మా కృష్ణపక్షమ్మునం దొక్క రేయి
నుదధిమధ్యమ్మున నుడుపంబు వోడ్కఁ
నతులవిశాల నీలాకాశసీమఁ
గన్పట్టె నొక్క చిక్కని చిన్నిమబ్బు.

దానితోఁ జేర దిక్తటములనుండి
దాఁగలి పొల్పారదము లెన్నియేని
యుదయించి, యెగసి, యొండొంటఁ
గ్రిక్కిరిసి,
మసిగోలెములకోట్లు మలసిన యట్లు
ధూమపుస్తోమముల్ తోడైనయట్లుఁ
గట్టియేనులమంద కదిసినయట్లుఁ
దారుతేరులబారు తనరారినట్లు
కాటుకకొండలు గ్రమ్ముకొన్నట్లు
బహుళమ్ముగా వ్యోమపథమునఁ బర్వఁ
గావిరికప్పు చక్కఁగ నొప్పినట్లు
నీలమణులరాశి నెఱపినయట్లు
కారుమొయిళు లంటఁగట్టిన యట్లుఁ
బాపౌఘములఁ గడుఁ బఱచినయట్లు
మున్నీటఁ బుడమిని ముంచినయట్లు
నలమె భూతలము గాఢాంధకారంబు.

ఆ తమోమయమగు నంతరిక్షంబు
వ్రచ్చి, యైరావతీవల్లరీసమితి,
శ్యామ వాల్మీకసంచయ పార్శ్వతటులఁ
దళతళలాడెడు దర్వీకరములు
పృథులవేగమునఁ గంపించుచందమున
ఘుమఘుమార్భటిని నిర్ఘోషముల్ నిగుడఁ
గుధరమ్ము లదర, దిక్కులు పిక్కటిల్ల,
గుహలు మాఱుసెలంగఁ, గుంభిని
యగల,
ఘనఘనాఘనముల గర్భగోళముల
వెడలె మహాభీలవృత్తి నెల్లడల,
ఉఱుములు మెఱుపు లిట్లొండొంటఁ
జెలఁగ
పెళపెళార్భటులతోఁ బిడుగులు రాలె
నంతఁ జల్లనిగాడ్పు లంతటఁ బొలయ
నచ్చనగాయల యాకృతిఁ దనరి
బడబడఁ గడువడిఁ బడె వడగండ్లు;
కొదమ మేఘములను గున్నయేనుఁగులు
గగన సరోవరాంకమునందుఁ జేరి
జలకేళిఁ దవిలి విచ్చలవిడి నాత్మ
తుండాగ్రములఁ బీల్చితోయంబులెల్ల
భువిఁ బయింబయిఁ జిందుపోల్కి వర్షించె
నఖిల ప్రపంచ మేకార్ణవరీతి
సల్ప, మహాస్థూలజలధార లిట్లు
వెంపొందెనోయని బెగడజగంబు

ఆక్షణమంద ధరావలయమున
వంకలు హెచ్చెఁ బల్వంకలనుండి
యేఱులు పాఱె మిన్నేటిని మీఱి;
కుంటలు దెగెఁ; గొలఁకులు నిండిపొరలె;
చేలు నీట మునింగెఁ; జెఱువుల వారి
కట్టలు దిగజాఱఁ గనుచూపు మేర
నెల్లెడ నీరములే పెల్లునూఱె,

ఇది జల మిదిపొల, మిది నెలవనుచు
నిది పుట్ట, యిది గుట్ట, యిది చెట్టటంచు
గని పట్ట వీల్గాని కడలిని బోలి
కనఁబడెఁ; బుడమియు గగనతలంబు
దెలియరాదయ్యె; రాత్రింబవళ్ళొక్క
కరణిఁ జూపట్టెఁ; జిక్కని తమస్సార
గర్భ మందడఁగి లోకము వీఁకయుడిగె

(సశేషము)





మద్రాసు రాష్ట్రంలోని బెస్తలు సముద్ర ప్రాంతాలలో చేపలు పట్టుటకు దోనెలనుపయోగించు దృశ్యము. దోనెలు చిన్నవి, చౌక అయినా భారీస్థాయిలో చేపలు పడవు. మత్స్యపరిశ్రమాభివృద్ధి దృష్ట్యా యిప్పుడు బెస్తలకు మరపడవలను సమకూర్చి, చేపలెలాపట్టుకోవాలో, ఎలా నిలువచేయాలో మేలిరకంపద్ధతులు నేర్పబడుతున్నవి. దీనివల్ల చేపలుపడటం బాగా అధికమయింది.

శ్రవ్య నాటిక.

# ఊర్వశి

శ్రీ ముళ్లపూడి నరసరాజు



[స్థలం—స్వర్గపురి—పౌర్ణమి వెన్నెల వీచికలతో, పరవళ్లు పోతూంది సౌభాగ్య సుందరమైన ఇంద్రుని దుర్గము. అప్పుడే ఇంద్రసభలో, నృత్య సదస్సులో పాల్గొన్న ఊర్వశి వచ్చి నందన వనంలో చంద్రకాంత శిలపై అలదోకగా కూచొని ఉంటుంది. ఇంతలో దేవి. దేవి ఊర్వశి చెలికత్తె గాదు. దాసి కాదు...వస్తుంది... కాని, దేవి అంటే ఊర్వశికి వల్లమాలిన ప్రేమ.]

దేవి:—(ఊర్వశిని చూసి) ఓహో, ఒంటరిగా కూచొని వెన్నెల మేస్తుంటివా...

ఊర్వశి:—అవును గాని...ఎక్కడికి. చాలా హడావిడిగా పోతున్నావ్...

దేవి:—హడావిడే...ఇంద్రులవారి ఆజ్ఞ!

ఊ:—(అదోలా చూసి) దేనికో ..

దే:—నీకు సంబంధించినది కాదులే!

ఊ:—అంత రహస్యమా! దాచేస్తున్నావ్?

దే:—రహస్యానికేముంది ... భూలోకంనుండి, ఎవరో వచ్చారట... అందుకుగాను...

ఊ:—అందుకుగాను... ఏమిటో చెప్పు మరి?

దే:—చంద్రమహలులో విడిది ఏర్పాటు చేయమన్నారు!

ఊ:—(ఆశ్చర్యంతో) చంద్రమహలులోనా... విడిదా...అది కేవలము రాజబంధువులకేగాని... ఇతరులకు కాదే...

దే:—ఈ వచ్చినవారు కూడా మరెవరూ కాదు. రాజబంధువులకన్నా గొప్పవారు. మన మహేంద్రులవారి పుత్రుడు.

ఊ:—మన ప్రభువుల పుత్రుడా! ఎవరతను?

దే:—ఆ వివరాలు తరవాత మనవి చేసుకుంటాను. గాని, నన్ను ప్రస్తుతం పోనీ...(లేచి పోబోవును).

ఊ:—(పోతూన్న దానిని చేయిపట్టి బలవంతాన కూచోపెట్టి) అసలు సంగతేమిటో చెప్తేగాని, నిన్ను కదలనివ్వను!

దే:—చంపావ్ పో, సరే! (కూర్చొని) ఇతనెవరో గొప్ప వీరుడట, శూరుడట. అతనిపేరు... పే... రు...ఆఁ... అర్జునుడు... అవును అర్జునుడు.

ఊ:—(ఉలిక్కిపడి) అర్జునుడా...మన నగరికి వచ్చేశారా...నిజంగానా... నిజంగానా ... నీవు చూశావా...అతన్ని ...ఎలా వుంటారు...?

దే:—అవును. ఊర్వశీ! దేనికా ఆతృత?

ఊ:—(నిట్టూర్చి) ఏమీ లేదులే...

దే:—అయితే ఏదోవుంది విశేషము. నాతో చెప్పవు కదూ, పోనీలే...

ఊ:—నీతో చెప్పకుండానా! ఆ మహాశూరుని రూప సౌందర్యాదులు ఇదివరకే విన్నాను. కాని, దర్శనభాగ్యం కలగలేదీనాటివరకూ.

దే:—అలాగా, అంత గొప్పవారా ఇతను?

ఊ:—అదేమిటి దేవీ! నీవెప్పుడూ, ఇతని పేరు ప్రఖ్యాతులు విననేలేదా?

దే:—భూలోక సంచారవాసులకు తెలుస్తుంది కాని, నాకెలా తెలుస్తుంది ఈయన గొప్పతనము.

ఊ:—ఒక్క భూలోకమే కాదు దేవీ! స్వర్గ, మర్త్య, పాతాళ లోకములకు కూడా ఈయనపేరు వినని వారుండరు.

దే:—నిజమే. అంతఃపురగమే మా జీవితమయినప్పుడు, లోకం సంగతి మాకెలా తెలుస్తుంది?

ఊ:—పోనీ, ఈరోజు ఆయన్ని చూశావా?

దే:—చూశాను. ప్రభువుల సరసను కూర్చొని వున్నప్పుడు. అబ్బ! అమిత తేజోరాశులు.

ఊ:—(ఆనందంతో) ఎలా వుంటారు దేవీ?

దే:_నవమోహనాంగులు, భూలోక సార్వభౌములు వారి అందచందములు వర్ణనాతీతములు.

ఊ:-ఇంకా...ఏమైనా...

దే:-ఏమిటి ఊర్వశీ...విష్ణ్వంశ సంభూతులైన, చక్రవర్తుల గురించా నాబోటి సామాన్యులు చెప్పటం.

ఊ:_పోనీలే దేవీ, మరొక్కటి అడుగుతాను చెప్పు. ఇతను మన రాచనగరికి వచ్చినట్లు ఇతరులెవరైనా చూడలేదు కద!

దే:-(అర్థంకానట్లు ఆమెనుచూసి) తెలియదను కుంటాను. ఏం, ఎందుకలా అడుగుతున్నావు...

ఊ:_ఎందుకుగాదు_చంద్రాగమనం కాగానే కలువ రాణులన్నీ స్వాగతవచనాల నాలపించవచ్చునని భయం.

దే:_అది ప్రకృతిసిద్ధము కదా...దాన్ని నీవెలా కాదనగలవు?

ఊ:_ప్రకృతి సిద్ధమైనంతమాత్రాన, అర్హతానర్హతలు చూడవద్దూ!

దే:_దైవసృష్టిలో అందవిహీనమైనదీ, అక్కరకు రానిదీ ఉండదు, ఉండకూడదు.

ఊ:-నిజమే కావచ్చు. కాని సౌందర్యారాధనలో అందచందములకే ప్రాధాన్యమిచ్చి మెచ్చుకుంటారు. కారణం ?

దే:-అది వారివారి మనోభీష్టముల ననుసరించి తారతమ్యత గుర్తిస్తుంటారు. అయినా...నాకెందుకు? (లేచి) వస్తాను, చాలా వేళయింది (పోవును).

ఊ:-(దిగ్గునలేచి పోతున్న దేవిని వెనక్కి పిలిచి) దేవీ, ఓ దేవీ! చంద్రమహలులోనే కదూ! ఆయనకు బస.

దే: 'అవును' అన్నట్లు తలూపి పోవుచుండును.

## రెండవ రంగము

(ఆదేరాత్రి...అర్ధరాత్రి... ఊర్వశి సర్వాభరణ భూషితురాలై జరీబుటాల బంగరు సరిగంచు, కావిరంగు సన్నని చీర ముసుగువేసి, మెల్లగా చంద్రమహలులో ప్రవేశం. అద్వితీయ సౌందర్యరాశి అయిన అర్జునుడు, నవరత్నఖచిత సుఖమల్ పట్టెమంచముపై, ప్రశాంతముగా నిద్రించుచుండును...).

ఊ:_(సుప్రశాంతముగా నిద్రపోవు, నా జగన్మోహనాకారుని సౌందర్యశోభను ఒక్కసారి తనివిదీరచూసి... మెల్లగా...అతని ప్రక్కను కూచొని పాదములపై మృదుహస్త స్పర్శ గావించును...)

అ:_(ఉలికిపడి లేచి) ఆఁ... ఎవరు నీవు?

ఊ:-(చటన పానుపుడిగి) నేనే...పొరపాటు...

అ:-(సందేహంగా) అంటే...ఎవరు నువ్వు?

ఊ:_నేనెవరినో మీకు తెలుసుకోవాలని...ఉందా...

అ:_(ఆమె పరిస్థితి అర్థంకాని ముఖభంగిమలతో) అవును...

ఊ:-అయితే...తెలుసుకోలేక పోయారన్నమాట?

అ:_నాకెలా తెలుస్తుంది...నువ్వెవరివో...

ఊ:-(ముసుగుతొలంచి ఓరగా చూస్తూ) నన్ను చూడగనే...చెప్పవచ్చునే...నేనెవర్నో...

అ _ఏమిటీ అధికప్రసంగం...

ఊ:_అడిగినదానికి సమాధానం చెప్పటం...అధికప్రసంగమా...

అ:-సరే...నీ వెందుకిలా ఒంటరిగా నా గదిలోకొచ్చావు?

ఊ:_మిమ్మల్ని చూడ్డానికని.

అ:_నన్ను...నువ్వెరుగుదువా...

ఊ:_సాహసోపేతముగల, మీ అద్భుత చరిత్రను శ్రవణపేయముగా, వినడమే గాని, కన్నుల పండువుగా, చూడ్డానికి నోచుకోలేని...నిర్భాగ్యురాలను...

అ:_బాగానే వుంది! ఇందువల్ల నీకొచ్చిన ఫలితమేమిటి?

ఊ:_మీ దర్శనంతో బాటు...పరిచయ భాగ్యాన్ని పొందుదామని!

అ:_ఈ అర్ధరాత్రి సమయంలో...ఇలా ఒంటరిగానా...రావటం?

ఊ:-మీవంటి మహనీయులు పరిచయం కావాలన్నపుడు, మాబోటివారి కింతకన్నా, సులువైన సమయం లేదు గాబట్టి.

అ:_నీ ధోరణిబట్టి చూడగా...సామాన్యురాలవుగా...కనిపించలేదే...ఇంతకీ ఎవరు నీవు...

ఊ:_ఆర్యపుత్రులకు...నన్ను తెలుసుకోవాలన్న కుతూహలం కలగడం...నా అదృష్టం...

అయినా ... మీబోటివారికి అర్థంగాని పరిస్థితిలో లేదే...నా వేషంగాని...నేనుగాని !

అ:-ఈ డొంకతిరుగుడు సమాధానం కాకపోతే... సరిగ్గా చెప్పవచ్చునే...

ఊ:-భూలోక రాజేంద్రులు...భోగప్రియులని...రసరాట్లని, మా దేశంలో చాలా వాడుక...నిజమేనా ?

అ:-నిజమే కావచ్చు...అయితే...

ఊ:-మరేం లేదు...ఊరకనే అడిగాను...అడుగుదామని. అసలే మా అక్క చెల్లెండ్రు ద్రౌపది, సుభద్రలకు క్షేమమేనా ?

అ:-(ఊర్వశిని ఒక్కసారి అదోలా చూసి) క్షేమము గాక...

ఊ:-మరి, మా చిరంజీవి అభిమన్యుడు కుశలమేనా ?

అ:-ఆఁ...కుశలమే ... తాతగారింటన్నాడు (కోపంతో) ఇంకా ఏదైనా ప్రసంగించడానికి మిగిలివుంటే...రేపు ఉదయం రావచ్చు...దయచేసి వెళ్లు నిద్రొస్తూంది. (యథాప్రకారంగా పడుకొని కళ్లు మూయును)

ఊ:-మహాప్రభువులు...ఎదుటివారిపై చూపించు నిరాదరణమే గాక...కోపంకూడా వచ్చినట్లుందే... చూడగా...

అ:-(ఒక్కసారి దిగ్గునిలేచి) చాలించు నీ ప్రసంగము...ఒంటిగా నా గదిలో ప్రవేశించటమే మొదటి తప్పు...వచ్చినదానివి వచ్చినట్లుండక... అనవసరపు ప్రసంగంతో విసిగిస్తున్నావు...పైపెచ్చు వాగుడు...కోపంగాక...గౌరవమా నీపై ...

ఊ:-నా సౌందర్యమంత వెగటు కలిగించినదా ? ప్రభువులకు ?

అ:-నీ సొగసు... నీ సోయగము...అందము చందము నాకనవసరము.

ఊ:-నే నెవ్వతెనో తెలిస్తే తమకింత కోపం రాకపోను ?

అ:-ఆఁ...తెలియకేం... తెలిసింది ? వేశ్యవని !

ఊ:-ఉత్త వేశ్యనే కాదు...దేవ వేశ్యను.

అ:-అయితే అవచ్చు ?

ఊ:-అవచ్చు కాదు...నిజంగా...నేను దేవవేశ్యను... ఈ వియచ్చర నారీమణులందరు...నా చెలికత్తెలు...రణరంగమున అసువులుబాసిన మహావీరత్యాగులు, మాయింటి అతిథులు. ఇప్పుడు తెలిసినదా...నే నెవరినో...మా ఏలిక, మహేంద్రుడుకూడా...మా గీటినగీటు దాటడు...పరమ తపోనిష్ఠాగరిష్ఠులైన మహర్షులుగూడ మా గజ్జెల మోతకు కరిగి నీరు కావలసినదే...

అ:-గొప్పదానివే...

ఊ:-అని తెలిసివుండేనా...ఈ తృణీకారం...

అ:-అయితే...నీవు ఇంద్రుని దర్బారులో నాట్యము చేయుచుందువా...

ఊ:-ఉత్తి నాట్యమే కాదు...సంగీతబద్ధమైన నాట్యము.

అ:-నీ పేరు...ఊర్వశి అనుకుంటాను !

ఊ:-అవును...అలానే పిలుస్తుంటారు !

అ:-అయితే...ఇక్కడి కెందుకొచ్చావు...

ఊ:-మొదటే మనవి చేసుకొన్నాను...

అ:-ఏమని !

ఊ:-దర్శనంచేసి తరించుకుందామని ;

అ:-నీవచ్చిన పని అయింది కదూ...

ఊ:-ఇంకా లేదు...

అ:-ఏమిటా తరువాయి !

ఊ:-మీరే...

అ:-నా సహాయమా...నీవు కోరేది !

ఊ:-కాదు...సహవాసం !

అ:-నీతోనా...

ఊ:-అంత ఆశ్చర్యం దేనికో...

అ:-నీ తెలివితక్కువతనానికి !

ఊ:-నా సాంగత్యం వెలలేనిది !

అ:-అంత మూర్ఖుణ్ణి కాదు...

ఊ:-ప్రభువులు...శృంగార మూర్తులు...మనోభిరాములు...

అ:-మేము నిన్ను కోరలేదే...

ఊ:-నా స్వాతంత్ర్యాన్ని ఎందుకు కాదనాలి !

అ:-అది ధర్మవిరుద్ధం గనుక !

ఊ:-ప్రణయమూర్తులైన అర్జున సార్వభౌములేనా. ఇలా మాటాడుతుండేది...

అ:-అవును...నీవు కోరి వరించాలనుకుంటున్న అర్జునుడే...ఊర్వశీ...మా భూలోకంలోని మానవులింకా...నీతినియమాలకు కట్టుబడి వున్నారు... పాపభీతి...దైవభక్తి...మాతాపితృ గౌరవము... నేటికికూడా తాండవిస్తోంది...

ఊ:_ఇది స్వర్గపురి అన్నమాట మరచినట్లున్నారు!

అ:_కనుకనే...ఇంత అవినీతికి ఆలవాలమయిందా...

ఊ:_నీతి...అవినీతుల తారతమ్యము మానవులకేగాని, దేవతలకు గాదు...

అ:_నీవు దేవతవై ఉండికూడా, ఇంత నీచత్వానికి సాహసిస్తున్నావంటే చాలా భయంగా వుంది!...

ఊ:_ప్రభువులను దేవతల శక్తిసామర్థ్యములం తెలుసుననుకుంటూ...

అ:_ఇంత నిర్భయంగా నిరాకరిస్తున్నారని, అనికదూ...

ఊ:_మీ హృదయానికి ఇంత కాఠిన్యత ఎలా వచ్చిందో...నా కర్థం కాకుండా వుంది...

అ:_ఊర్వశీ...ఎందుకిన్ని మాటలు...నీవు నాకు మాతృసమానురాల వన్నమాట మర్చిపోయినట్లున్నావు...నా తండ్రి ఆస్థాన నాట్యకత్తెవు...ఆయన పోషణలో...ఆయన కనుగొలకుల్లో మెలగుతున్నావు...నా తండ్రికి సంబంధించిన దానివి కాని...నాకు కాదు...నీ పుత్రునితో సమానమైన నాతో...ఇటువంటి నీచపు పని చెయ్యటం...నా జీవితానికే కాక నా వంశానికి...తీరని మచ్చను కలిగిస్తున్నావు...నీవు స్త్రీవని ఊరకున్నాను...గాని...క్షమింపరానిది...కనుక, దయుంచి తిరిగి పో...వెళ్లూ...

ఊ:_దేనికీ సంబంధబాంధవ్యాల ప్రసక్తి యిప్పుడు?

అ:_దేవతలలోకూడా...వివేకం లేనివారుంటారనుకో లేదు...

ఊ:–అర్జునా...నేనెంత ప్రయత్నించినా...నా ప్రయాస వృధా అయింది! నీవు శూరుడవనీ...జగదేక వీరుడవనీ...గర్వంతో...నన్నే అవమానించావ్...తృణీకరించావ్...సర్వశక్తి సమన్వితులు దేవతలని తెలిసీకూడా...బెట్టుసరి చూపి...కాలదన్నావ్...అనవసరంగా నా హృదయాన్ని రెచ్చగొట్టావ్...స్త్రీ హృదయం ఎలాంటిదో...నీకు తెలీదనుకుంటాను...అమృతాలు చిలికించడానికి బదులు...హాలాహలాన్నే సృష్టించుకొన్నావు...చూడు...నాహృదయం...ఎలా ప్రజ్వరిల్లుతూందో...అనుభవించు...ఎందుకూ పనికిరాని పేడిరూపం దాల్చి –పో... (నిష్క్రమణ)

# శ్రీరామకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౧౦౬

శ్రీ మహాబాహు, రఘువీరు, శ్రీ శుభాంగు
భద్రదంతావళము నెక్కివచ్చు వరదు
రామచంద్రు, ఛత్రావృత సోమవదనుఁ
గనులఁ గానంగ వాంఛింతుఁ గఅవుదీఱ

౧౦౭

శ్రీరామచంద్ర! ఆశ్రితుల మందార!
కరుణాసముద్ర! భక్తజన - సుభద్ర!
భవబంధనాశనా! ప్రహ్లాదవరద!
పన్నగశయన! ఆపన్న శరణ్య!
నాథ! రమానాథ! ననుఁ గరుణింపు
దీనుండ, నజ్ఞాన తిమిరంబు గప్పె;
భయములు గ్రమ్మె; నభయ
మొసంగఁగదు
వినయంబుచే నిన్ను వేడుచునుందు.

౧౦౮

వసుధ-నీ చరితామృతా స్వాదనంబు
పెక్కు సోమపానములకు-నిక్కువముగ
సాటి; యా సోమపానంబు జన్మదుఃఖ
భరము జేకూర్చు; శ్రీరామభద్ర! నీదు
విమల నామామృతము గ్రోలు
విబుధవరులు
జన్మదుఃఖంబు బడయరు సత్యమిద్ది;
అనఘ! రఘురామ! నీదు
నామామృతంబు
సతము నేఁ గ్రోలఁ జేయుము; సత్యశీల!

౧౦౯

రామచంద్ర! దయాసాంద్ర! రావణాంత
కా! విభీషణరక్షకా! కమలనయన!
జన్మజన్మంబులందు నిన్ స్మరణ సల్పు
జ్ఞానమును భక్తి నాకిమ్ము; మానివినుత!

౧౧౦

శ్రీరామచంద్ర! రాజీవనయన! ర
మాపతీ! రాఘవా! భూపాలతిలక!
రావణ సంహార! రఘునాయకా! ము
కుంద! రక్షింపుము! కొమ్ము జేజేలు.

౧౧౧

వేదము తెలుపంగఁ జాలవు; నీదు పాద
పద్మధూళి రహస్యంబు పావనాత్మ!
శ్రీరమానాథ! రామ! విరించి నీదు
నాభి పద్మంబుననుబుట్టె నాగశయన!
శివుడు నీ నామసారంబు జిహ్వఁ గ్రోలె;
భక్తులకు నేమియున్నదో పంకజాక్ష!
పాదపద్మధూళి నొసంగి, ప్రాపునిచ్చి
కరుణ రక్షింపు రఘురామ! కంసహరణ!

౧౧౨

బ్రహ్మలోకంబునందు, శ్రీరామచంద్ర!
అజుఁడు, నీ యవతార కథామృతంబుఁ
గ్రోలుచుండు; వాగీశ్వరి కుతుకమలరఁ
బాడుచుండు, మహానంద బాష్పకణ ప
రంపరార్ద్రకుచాగ్రయై, రామ! నీదు
చరిత వీణాస్వరంబుల; సరసముగను

నారదాదులు స్తుతియింత్రు; శ్రీరమేశ!
భవుఁడు నిన్ స్మరియించు పార్వతినిగూడి
అట్టి శ్రీరామ! నిన్నుఁ జేబట్టినాడ,
శరణు వేడితి రక్షింపు; జలజనయన!

౧౧౩

పాపాత్ముఁడు, బరుల భాగ్యాపహారి, కు
లభ్రష్టుఁడితరుల లలనలందు
మగ్నచిత్తుఁడు, దొంగ, మాతృ
పిత్రహుడును
బ్రహ్మహత్య నొనర్చు భ్రష్టమతియు
మానుల బాధించు మనుజుండు, దుర్మార్గుఁ
డాతతాయియు, మొదలైనవార
లెవ్వరేనియు భక్తియేపార సతతమీ
కర్ణామృతంబుఁ జక్కఁగ, బఠింపఁ
గల్గిరేని, ముక్తికాంత సిద్ధంబగు;
మాని జనుల కందరాని పదవి
ప్రాప్తియగును, భోగభాగ్యంబు సిద్ధించు
ననగ, భక్తజనుల కలతియగునె?

౧౧౪

శివుని స్వరూపమై - చెన్నారు శంకర
స్వామి, గీర్వాణభాషను, లిఖించె
'రామకర్ణామృత' రసకావ్య మాదిలో
నంతఁ జేకూరు వంశాబ్ధి వెలసి
నట్టి, సిద్ధకవీశ్వరాహ్వయుండనుపమ
శ్రద్ధఁ దెనింగించిరామచరిత;
పూదండగాగ, సంపూర్ణ భక్తిప్రేమ
నర్పించినాఁడు, నీ కతఁడు మున్ను;
యతని పూదండ, కేదండ మర్పణంబు
సేసి, నాభక్తి తెలుఁగునఁ జిన్ని పూల
మాల నర్పించినాడ! రమావినోద!
కైకొనుము నాదు కానుక లోకనాథ!

౧౧౫

వసుమతిఁ గాశ్యపావత్సార నైద్రుభ
ము; త్రియార్షేయంబు-ముదముగాఁగ
ప్రవరాన్వితము; కాశ్యపసగోత్రమాశ్వలా
యన సూత్రమందుపై, యధ్యయనము.
ఋశాఖ్య; గూళూరు కృష్ణార్య గుణశాలి
మా తండ్రి శ్రీవిష్ణుఁ బ్రీతిఁగొల్చుఁ
దా, ననుష్ఠించె మధ్వాచార మతము, స్మా
ర్తకులకన్యకను కాంతగ, వరించె
నామె యశ్వత్థమాంబ; యాయమ్మకేము
ముగ్గురము, బుత్రకులము; సమ్ముదము
తోడ
జ్యేష్ఠుం, డనహాఁబలుడని, వచించుచుండ్రు;
దాశరథి! రఘురామ! భక్తజనపోష!

౧౧౬

దహి, ద్వితీయుండు, నంజుండరావుగలదు
అద్వితీయుండు, సకల కార్యములయందు;
రహి, తృతీయుండు, శంకరరావు గలదు
కరుణగలవాఁడు, దాక్షిణ్యపరుఁడతండు.

౧౧౭

నాదు సాధ్వి సీత - నమ్రచరితురాలు
చదువు సంధ్యలందు - శ్రద్ధ కలదు;
మధుర కంఠముండి - మాధవుఁ గీర్తించు
గురుల బంధుజనులఁ గూర్మికలదు.

౧౧౮

ఆమె యందు నాకుఁ బ్రేమతో జనియించి
నారు; షష్ఠసుతులు ధీరమతులు;
మానధనులు, శ్రీకుమార్తెలు ముప్వురు
రాముఁడెపుడు వారి రక్షసేయు.

౧౧౯

తెలుఁగువారికెల్లఁ దేట తెల్లముగాఁగఁ
దెలుఁగు బాస తీపి తెలియునట్లు
రచన సల్పినాఁడ, రామకర్ణామృత
మాదరింపుఁడయ్యా! యాంధ్రులార!

౧౨౦

శ్రీరమాపతి నాకిచ్చి చిత్తశుద్ధిఁ
గీలుబొమ్మఁగఁ జేసి, లిఖింపఁజేసె;
మూఁడవ ప్రకరణము, సమ్మోదము జెందె
నాదు డెందంబు; అర్పింతు నా జోహారు.

౧౨౧

మునిజనసువిచారా - మాని సంస్తుత్య శీలా!
వనజముఖసుధీరా - వాలి సంహార వీరా!
జనగణ, మనవాసా - చారు సౌశీల్యహారా!
వినుతిగొనుము రామా - విశ్రుతానంద రూపా!

తృతీయాశ్వాసము సంపూర్ణము

(సశేషము)




# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

శివబంటు ఎదురుతెన్నులు చూస్తూ చాలాసేపు గుహాముఖద్వారంవద్ద కాచుక్కూర్చున్నాడు. హరకుమార్ ఎంతకూ రాకపోయేటప్పటికి విసుగుజెంది పోయాడు. "నేను చెపుతూనే వున్నాను. పోవద్దయ్యా అని. వింటేనా? ఇంకా ఏం? ఏ మాయపిల్లో వల్లో వేసుకుపోతుంటుంది" అని గొణుక్కుంటూ "కాస్సేపు మీ రిక్కడే వుండండి. నేను మా యువరాజు జాడ కనుక్కుని మళ్లీ వస్తాను" అని బయలుదేరాడు గుర్రాలకు లాలనగా చెప్పి. ఇంతలో గాండ్రుమని భయంకరంగా అరుపు వినిపించింది. శివబంటు వులిక్కిపడి — "అరి బాబోయ్ పెద్దపులి అరుపులా వుంది" అని సొరంగంలోకి పరుగుతీశాడు. ఒక అరగంట గడిచిన తర్వాత తిరిగి గుహ ముఖద్వారం వద్దకు వచ్చి చూశాడు. ఏముంది? రెండు గుర్రాలు మాయమైనాయ్ — "ఆ గాండ్రుమన్నదే వీటిని లాక్కు వెళ్లి వుంటుంది!" అని కన్నీటిబొట్లు రాల్చి జై పరమేశ్వరా అని గుహద్వారం గుండా బైలుదేరాడు. ఎంతదూరం పోయినా ఆ సొరంగం అంతూ పొంతూ చిక్కటంలేదు. మొదలుపెడితే దాని అంతు చిక్కిందాకా పట్టువిడువని ధీరుడు శివబంటు. ఏమైతే అయ్యింది - దీని అంతేమిటో తేల్చుకోవాలి అని నడకజోరు హెచ్చించాడు. అలా వస్తుండగా రెండు దారులుగా విడిపోయిందా సొరంగం. నైరుతి దిశగా ఒకద్వారం, ఆగ్నేయదిశగా మరొకద్వారం! పరేశని దైవాన్ని ధ్యానించుకుని ఆగ్నేయదిశగా పోవు మార్గాన ప్రవేశించాడు. కొంతదూరం పోయేసరికి ఆ ద్వారం మరీ ఇరుకైపోయింది. నెమ్మదిగా తన స్థూలకాయాన్ని ఇరికించి బయటపడ్డాడు. అలా పోతున్న ద్వారం ఒకచోట తటీమని ఆగిపోయింది. పైన ఏదో అడ్డుగా వుండటంతో దానిని తొలిగించాడు. పైన గది! లోపలికి వెళ్లాడు. అది చాలా విశాలమైన గది! ఓ వేళ ఈ మార్గం రాజభవనానికన్నమాట-! అనుకుంటూ ఆ గదిలో పచార్లు చేయసాగాడు. ఒక స్త్రీ ఆ గదిలో మంచంమీద పడుకుని వుంది. సద్దువిని వులిక్కిపడి లేచి - "ఎవరు నువ్వు?" అంది కోపంగా.

"నేనెవర్నో నాకే తెలీదు. ఈ ద్వారంగుండా బయలుదేరితే ఇక్కడికి చేరాను" అన్నాడు అమాయకంగా.

"ష్! మర్యాదగా అవతలకు వెళ్లు! అవతల గదిలో మా రాజకుమార్తె నిద్రపోతోంది—!" అన్నది.

"రాజకుమార్తా?" అని గుటకలు మింగాడు.

"అవును రాజకుమార్తె. ఏం! ఆమెమీద మనసు పోయిందా!"

"ఊ!"

"అయితే నేను చెప్పినట్లు చెయ్యి. నిముషంలో రాకుమారిని నీ దగ్గరకి రప్పిస్తా." అంది.

"ఓ అల్లాగే! ఏం చెయ్యమంటావేమిటి?"

"ఇంతలో తలుపు చప్పుడైంది."

"అమ్మో! మా మహారాణీగారు మనమాటలు విన్నట్టున్నారు. తలుపు తట్టారు. ఇప్పుడేం చెయ్యాలి!"

"అయ్య బాబోయ్! రాణీగారే - నన్నెక్క

డన్నా దాచేద్దూ. నీకు పుణ్యముంటుంది" అన్నాడు గడగడా వణుకుతూ.

"ఈ సందుగా పెట్టెలో దాక్కో. ఆమె పోగానే పైకితీస్తా" నంది. అలాగేనని శివబంటు పెట్టెలో దూరాడు. ఆమె తాళంవేసి పారేసింది.

తలుపు తీసింది. మహారాణీ స్వయంగా వచ్చింది. "లోపల ఏమిటో గుసగుసలు వినిపిస్తున్నయ్ ఏమిటీ!" అంది.

"గుసగుసలా? అబ్బే! నాలోనేనే గొణుక్కుంటున్నాను" అని సర్ది చెప్పింది. రాణీ వెళ్లిపోయింది. శివబంటు ప్రాణాలు కుదుటపడినాయ్.

ఆమె వెళ్లిపోయినా శివబంటును పెట్లోనుంచి తీయలేదు. పెట్టెలోనుంచి శివబంటు పోరు ఎక్కువైంది "బయటకు తియ్యి!" అంటూ.

"ఇప్పుడు కాదు! ఇప్పుడు కాదు!" అని తెల్లార్లూ గడిపేసింది.

పాపం! శివబంటు చేసేదిలేక దాన్ని తిట్టిపోస్తూ అలానే ముణగదీసుక్కూర్చున్నాడు.

మహారాజు లేచి కాలకృత్యాలు తీర్చుకొని తీరుబడిగా కూర్చున్నాడు. ఇంతలో దాసీది పరుగెత్తుకుంటూ వచ్చింది. "ఏం పట్టావా దొంగని!" అత్రతగా అడిగాడు.

"పట్టటమేమిటి ప్రభూ! పెట్టెలో పెట్టిపారేశాను వాడిని! తీసుకు రమ్మంటారా!" అని అడిగింది.

"శీఘ్రమే తీసుకురా! వెధవని! ప్రవ్వి పాతేస్తా. సరాసరి రాజమందిరంలోకే మార్గం చేసుకున్నాడు! వెధవ! వారంరోజుల బట్టి దొంగను పట్టటానికి శతవిధాల ప్రయత్నంచేస్తున్నా, తప్పించుకుపోతున్నాడు. ఎంత తెలివిగా వచ్చాడు!" అని కారాలుమిరియాలు నూరటం సాగించాడు.

దాసీది పెట్టెను బలవంతంగా లాక్కొచ్చింది. "ఇదుగోండి ప్రభూ! మనకంటికి కనిపించకుండా చిత్తగిస్తున్న దొంగని ఇట్టే పట్టేశాను!" అంది దాసి.

పెట్టెలోపలి శివబంటు గుండెలు గుభేలుమన్నయ్. ఎవరో దొంగ ప్రతిరోజూ ఆద్వారానే వచ్చి దొంగతనంచేసి పోతుండేవా డన్నమాట! ఖర్మ కాలి నేనాద్వారాన రావటంతో నన్నే దొంగనుకున్నారు! ఈ విపరీత పరిస్థితిలో నా నిజవిషయం చెప్పినా నమ్మరు. నమ్మకపోగా ఒళ్లు నలగపొడిచేస్తారు. ఎలాగా తప్పించుకోవటం! ఆసు దీనిదుంప దెంచ! ఇది పరిశోధకురాలన్నమాట. ఎంత పనిచేసింది! ఎలాగా యీ ఆపత్తులోంచి తప్పించుకోవటం! అని వితర్కిస్తున్న సమయంలోచటుక్కున ఓ మెఱుపు మెరిసింది. ఎందుకైనా మంచిదని కూడా తెచ్చుకున్న "అదృశ్యమూలిక" ఇప్పుడు వుపయోగించింది అని దాన్ని నోట్లో వేసుకుని మనసులో ఆలోచించుకున్నాడు.

"చూడండి! మహారాజా! దొంగ బయట కొస్తాడు!" అని తాళంతీసింది. అంతఃపుర స్త్రీలూ సభికులూ ఆ పురానా దొంగను చూడాలని ఎదురు చూస్తూ నించున్నారు. పెట్టెమూత తెరవగానే కోతి ఒకటి బుడుంగుమని బైటికి దూకింది. అందరూ ఆశ్చర్యపోయారు. మహారాజు మండిపడుతూ, "ఎంత పొగరే! దాసీదానా! నన్నే అవమానం చేస్తావా! మహారాజుతోనా నీకు ఆటలు. ఉండు నీపని చెప్తాను" అన్నాడు రాజు.

దాసీది గడగడా వణుకుతూ— "నేను మనిషినే ఇందులో పెట్టాను ప్రభూ! కాని మూత తీసేసరికి కోతిగా మారిపోయాడు! ఇది వింతగా వుంది—!"

"నీ మాయమాటలు నాకు తెలుసులే! ఫో! నీ వుద్యోగానికి యీ రోజుతో చెల్లు—!" అని దాని నెత్తిమీద ఆ కోతి నెక్కించి బైటికి తరిమేశాడు. పాపం! దాసీది ఏడుస్తూ వీధిని పడింది. ఊరుదాటి చాలాదూరం వచ్చేసింది. "చావు! దురదృష్టపు కోతీ!" అని దాన్ని క్రిందికి దించి ఒక్కటేసింది. కోతి నోటిలోని "అదృశ్యమూలిక" క్రింద పడింది. వెంటనే కోతి మామూలు మనిషయ్యాడు. దాసీది ఆశ్చర్యపోయింది— "ఇదేమిటి! యింతకు క్రితం కోతి! ఇప్పుడు మనిషా! గమ్మత్తుగా వుందే!"

"గమ్మత్తుగా వుండదూ మరి. ఆ సమయంలో మనిషిగానే వుంటే నావీపు మారుమ్రోగేదే. అందుకనే యీ మూలిక మ్రింగి యిలా కోతినయ్యాను పిల్లా!"

"ఎదవ సచ్చినోడా! నిన్నుగురించి నా వుద్యోగం పోయింది" అంది ఏడుస్తూ.

"పోతే పోయిందిలే, వెధవ వుద్యోగం - నేనుండగా నీకేం భయం - ఇంతకూ నీ పేరేమిటి పిల్లా!"

"కాంచనం - నీ కెందుకూ నా పేరు!" సాగదీసింది.

"ఎందుకేమిటీ; కాంచనం! ఏం? నీకు నేను నచ్చలేదా!"

"నచ్చకేం!"

"ఇంకేం! అట్లా అయితే మనిద్దరికీ ఈడూ జోడూ!"

కాంచనం సిగ్గుతో తల వంచేసుకుంది — "పద! ఈవూరు దాటి వెళ్ళదాము. అదుగో! ఆ కనపడే వూళ్లో కాపరం పెట్టేద్దాం" అని కాంచనం రెక్క పట్టుకుని చెల్ మోహనరంగా అంటూ వుషారుగా యీలవేస్తూ నడక సాగించాడు.

(సశేషము)

---

# యుక్తిపరుడు రామకృష్ణుడు

శ్రీ జి. యస్. వి. సూర్యనారాయణమూర్తి

బాలలూ! పూర్వము మన ఆంధ్రదేశమును శ్రీ కృష్ణదేవరాయలు పాలించారని, వారి ఆస్థానములో అష్టదిగ్గజములు అనబడు ఎనమండుగురు కవులు కలరని మీరందరు ఎరిగినదే. ఆస్థానకవులలో రామకృష్ణుడొకడు. ఆతడు యుక్తి చేత ఎంతవారినైనను ఓడించెడివాడు. చాలా హాస్యముగా మాట్లాడెడివాడు.

ఒకనాడు రాయల ఆస్థానములో కవులందరు ఉండగ విందుభోజనమునకు రమ్మని హైదరాబాదు నవాబు వద్దనుండి కబురు వచ్చినది. వారి ఆజ్ఞప్రకారము కవులు వెళ్ళుటకు నిశ్చయించుకొనిరిగాని అచ్చట విందు భోజనము చేయుట వారి బ్రాహ్మణ సాంప్రదాయమునకు భంగమని వెళ్లుటకు జంకుచుండిరి, అపుడు రామకృష్ణుడు 'యుక్తితో ఆవిందు చెఱచెదను, వెళ్ళనిచో మనకు శ్రేయస్కరము కాదు. మీరందరు తప్పకరండ'ని చెప్పి కవులందరను విందునకు వెళ్ళుటకు ఒప్పించెను. కవులందరు నవాబుగారి ఆస్థానమునకు వెళ్ళుటకై ప్రయాణము నిశ్చయించుకొనిరి. మంచిరోజున కవులందరు కలసి నవాబుగారి ఆస్థానమునకు బయలుదేరి వెళ్ళిరి. అచ్చటనున్న చెఱువులో వారందరు కలసి స్నానము చేసి భోజనము చేయుటకు మడిబట్టలు కట్టుకొనసాగారు. వారితో బాటు రామకృష్ణుడు కూడ మడిబట్టలు కట్టుకొనుచుండగా అచ్చట ఒక రాయి ప్రక్కన పెద్దకప్పను చూచెను. రామకృష్ణుడు ఆ కప్పను మూట కట్టుకొని భోజనశాలకు తీసుకొని పోయెను. అక్కడ నవాబుకూడ కూర్చునియుండెను. కవులందరితో బాటు రామకృష్ణుడుకూడ భోజనము వడ్డించిన ఆకుముందు కప్ప మూటతోసహా కూర్చునెను. రామకృష్ణుడు తనతో తెచ్చిన కప్పను రెండుమూడుసార్లు తట్టగా అది మూట్టకట్టిన గుడ్డతోసహా ఎగుర మొదలుపెట్టెను. అది నవాబు గమనించి అదేమిటని రామకృష్ణుని అడిగెను. అది మాకుల దేవత, దానికి నైవేద్యము చెల్లించకుండా మేము భోజనము చేయరాదని బదులు చెప్పెను. దానికి నైవేద్యమునకై ఏమికావలెను అని నవాబు అడిగెను. మా కులదేవతకు నిత్యము పంది మాంసము చెల్లించెదము. పంది మాంసము అంటే మాకులదేవతకు మిక్కిలి ప్రీతికావున మీరు దయచేసి ఒక పందిని తెప్పించ ప్రార్థన అని రామకృష్ణుడు అనగా, నవాబు

గారు కోపముతో మీకు విందును లేదు, గిందును లేదు పొందని కసిరెను. దానితో కవులందరు ప్రమాదము తప్పి ఆసనములందు నుండి సంతోషముతో లేచిపోయి తెనాలి రామకృష్ణునియుక్తికి పొగిడిరి. బాలలూ చూచితిరా తెనాలి రామకృష్ణుని సమయ స్ఫూర్తి! మహమ్మదీయులకు పందియనిన సరిపడదని తెలిసిగదా యుక్తిగా తోడి పండితుల ఆచార సాంప్రదాయములకు భంగము కలుగకుండాను, నవాబుకు తాను రాలేదనే కోపము కలుగకుండాను తప్పించెను!

కాబట్టి యుక్తితో ఎంతటి ఆపదనుండైనను తప్పించుకోవచ్చును, కార్యసిద్ధి పొందవచ్చును.

—— (౦) ——

# దిష్టిబొమ్మ

**శ్రీ చామర్తి సుబ్రహ్మణ్యం**

టైమయిందంటూ గోపి నా దగ్గరకు వచ్చాడు. నేను కంగారుగా టైంటేబిల్ ప్రకారం పుస్తకాలు సర్దుకుని సంచి భుజాన తగిలించుకుని రెడీగా ఉన్నాను. గోపిగాడు కూడా పుస్తకాలు సర్దుకుని వచ్చేశాడు. ఇద్దరం స్కూలుకు బయలుదేరాం. అడ్డత్రోవన పోదామా! నిలువత్రోవన పోదామా! అని ఇద్దరికి సంశయము వచ్చింది. అడ్డదోవనే పోదాం రా, అని అన్నాడు గోపిగాడు, జడ్జీలా ఫోజుపెట్టి. ఏం? నిలువదోవన ఎందుకు పోకూడదు? అని ఎదురుప్రశ్న వేశా. నువ్వు ప్రతీ విషయంలోనూ ఎదురు సమాధానం చెప్తావ్. ఇది మామిడికాయల కాలం గదా! ఒకటోరకమైన కారం పట్టుకొచ్చా, దోవలోనున్న పుల్లయ్యగారి తోటలో బంగినిపల్లి కాయలు కోసుకు తిందాం. మనకు ఫస్టు పిరీడ్ ఖాళీయే గదా! అని అన్నాడు నా ప్రశ్నకు సమాధానమిస్తూ.

వాడి ప్లాను చాలా బాగుందని మెచ్చుకున్నా. ఎందుచేతనంటే నాకు మామిడికాయలంటే పరమ ఇష్టం. అందులో బంగినపల్లి కాయంటే చెవి కోసుకుంటాను. అడ్డదోవనే పోవుటకు నిశ్చయించి బయలుదేరాం. పుల్లయ్యగారి మామిడి తోపులోకి ఏ విధంగా ప్రవేశించాలి. ఏ విధంగా కాపలావాని కళ్ళుగప్పి మామిడికాయలు దొంగిలించాలి అన్న విషయములపై మేమిరువురమూ గమనాన్ని సాగిస్తూ చర్చించుకొన్నాం.

పుల్లయ్యగారితోట సమీపించాం. బరువుగా అడుగులు పడసాగాయి. తీరా తోటలోకి ప్రవేశించగానే ఎదురుగుండా యమధర్మరాజులా సాక్షాత్కరించాడు కాపలావాడు. ఇక ఆ ప్రాంతములో ఓ నిముషమైనా ఉంటే ఒట్టు. ఇద్దరం స్కూలు వైపు పరుగులు తీశాం.

స్కూలుగంట టైమయిందని సూచిస్తూ గణగణా మ్రోగింది. సమయానికే వచ్చాం గదాయని సంతోషంతో ఉన్నాం. మా స్కూల్లోనూ, ఊళ్ళోనుకూడా ఏ మంచిపని చేసినా, ఏ చెడ్డపని చేసినా మేమిద్దరం కలిసికట్టుగా చేసేవాళ్ళం. ఊళ్ళోవాళ్ళూ, స్కూల్లోవాళ్ళూ మా మంచిపనులు చూసి మెచ్చుకొనేవారు, మా చెడ్డపనులు చూసి తిట్టేవారు. మంగళము, అమంగళము మమ్మే వరించేవి.

స్కూలులో మా నియమిత స్థలాల్లో ఆసీనులయ్యాం. మా గోపిగాడు కూడా నా ప్రక్కనే కూర్చుంటున్నాడు. మా శరీరాలు అక్కడ ప్రెజంటుగా ఉన్నాయే కాని, మా మనస్సులు మాత్రం పుల్లయ్యగారి తోటలోనున్న మామిడికాయలమీద ఉంది.

బెల్ ఎప్పుడైందోకాని మా లెక్కల మాష్టారు క్లాసులో ప్రవేశించారు. మాదృష్టి మామిడికాయల మీదవున్న కారణంగా క్లాసులోకి ఎవరు వస్తున్నారో ఎవరు వెళ్తున్నారో కూడా తెలియకుండా ఉంది. మా లెక్కల టీచరు మమ్మల్ని సమీపించి, ఏరా హోమ్ వర్కు చేశావా? అనేదాకా మేమీ బాహ్య ప్రపంచంలోకి రానేలేదు. ఒక్కసారి కంగారుగా లేచిచెయ్యి — చెయ్యి — లేదండీ అని తడబడుతూ

అన్నాను. ఇక చూసుకోండి మా వీపు విమానం మోతెక్కిందంటే నమ్మండి. రెండు ఫిరడ్సు బెంచీ ఎక్కించాడు.

ఎలాగో ఆరోజు గడిపేశాం. సాయంత్రమే యిద్దరం ఊరవతల పొలిమేరలో సాయంత్రపు చల్లగాలులను పీలుస్తూ బ్రహ్మాండమైన ప్లానులు వేయసాగాం. చీకటి పడింది. ఎవరిండ్లకు వాళ్ళు పోయాం.

రాత్రల్లా ఇదే ఆలోచన. ఏవిధంగా మామిడికాయలు దొంగిలించడమా అని. ఆలోచనలతో నా బుఱ్ఱ వేడెక్కిపోయింది. కళ్ళు మూతలు పడసాగాయ్. శరీరము పరుపుమీద వాలింది.

తెల్లవారింది. కాలకృత్యాలు తీర్చుకున్నా. మళ్ళీ యథాప్రకారం ఇద్దరం కలుసుకున్నాం. సరిగ్గా తొమ్మిది గంటలకు మంచి శకునం చూసుకుని బయలుదేరాం.

మధ్యలో నాకు ఓ బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. ఒరే గోపీ! నాకొక ఆలోచన తట్టుతోంది. దాంతో మన విజయం తథ్యం అని అన్నాను. త్వరగా చెప్పు నన్ను చంపుకుతినక అని అన్నాడు గోపిగాడు. ఒరే గోపీ! మొదట నేనుపోయి కాపలావానిని సమీపించి హస్కు కొడతాను. ఈలోగా చప్పుడు కాకుండా తోటలో ప్రవేశించు, ఇది నా ప్లాను. నీ ఒపీనియన్ ఏమిటో చెప్పు అన్నాను. బ్రహ్మాండంగా ఉందిరా నీ ప్లాను. బెస్టయిన ఉపాయం చెప్పినందుకు నీకు వాటా ఎక్కువిస్తానులే అని అన్నాడు. నేను విజయోత్సాహంతో సినిమాలలో హీరోలా మొహంపెట్టి ప్రకృతివైపు ఫోజు ఇవ్వసాగాను.

తోటను సమీపించాం. నిన్నటికన్న మా కీరోజున ధైర్యంగా ఉంది. నేను దర్జాగా ఆ కాపలావానిని సమీపించి ఏరా అబ్బీ! ఈ తోట ఎవరిదిరా అని అన్నాను, నాకా తోట ఎవరిదో తెలియనట్లు.

పుల్లయ్యగారి తోటండి. కూచోండి బాబూ అని అన్నాడు. ఓహో వీడు మనకు బ్రహ్మాండమైన గౌరవం చూపుతున్నాడు. ఇదీ ఒక శుభసూచకమే అని అనుకొని వానితో సంభాషణ ప్రారంభించాను.

ఏరా అబ్బీ! కాపలా ఉన్నందుకు నీకు నెలకు ఎంతిస్తారురా అని అన్నాను.

ఏంకాండి బాబయ్యా! గుడ్డోన్ని కదండీ! ఇలాంటి పనికన్నా ఏ పనీ చెయ్యలేనండి. అందుకని అరు నాకు నెలకి అయిదు రూపాయలిత్తారండి అని అన్నాడు.

నేను దూరానున్న మా గోపిగాడికి సిగ్నలు ఇచ్చాను. అయితే నీకా అయిదు రూపాయలు సరిపోతాయా అని అన్నాను.

ఏం నేత్తానండి బాబయ్యా — మాపిటికి సందాకవలం అడుకుంటానండి. దాంతో కాలచ్ఛేపం నేత్తానండి అని అన్నాడు.

ఈ మధ్యలోనే నాకో అనుమానం కలిగింది. గోపిగాడు ఎక్కువ కాయలు కోసుకొని నాకు తక్కువ ఇస్తాడేమో. ఏరా అబ్బీ నేను వెళ్తున్నాను. అని కాపలావానితో అన్నాను. సిత్తం బాబయ్యా! అన్నాడు.

నేనుకూడా తోటలోకి ప్రవేశించా. ఎలాగయితేనేం మా గోపిగాడిని కలుసుకున్నా. ఆ తోటం చాలా పెద్దది. ఎండిన ఆకుల చప్పుడు కాకుండా ఎత్తి ఎత్తి అడుగులు వేస్తూ నడుస్తున్నాం. సడన్‌గా మా కాళ్ళకు బ్రేకులుపడ్డాయి. ఎదురుగా ఓ మామిడిచెట్టుక్రింద ఓ మనిషి నుంచున్నట్టున్నాడు. అతగాడి చేతిలో ఓ సాఫయిన కర్ర ఉంది. వాడు మాకేసే చూస్తున్నట్టుంది. ఇద్దరం వెనక్కుతిరిగి ఇంటికి పరుగు లంకించాం. ఆ రోజు మా ప్లానులన్నీ బూడిదలో పోసిన పన్నీరువలె అయ్యాయి.

మర్నాడుకూడా బయలుదేరి వెళ్ళాం. సరిగ్గా ఆ చెట్టుదగ్గరే, ఆ స్థలంలోనే నిన్నటి పొజిషన్‌లోనే ఉన్నాడామనిషి. ఏరా గోపీ వాడు మనిషి కాదేమోనురా! అని అన్నాను. వాడు మనిషి కాదని ఎలా 'ప్రూవ్' చెయ్యగలవు అని అడిగాడు.

నేను డిటెక్టివ్‌లాగ, చూశాను ఆ మనిషి నిన్న ఎక్కడున్నాడో, ఈవేళకూడా అక్కడే ఉన్నాడు. నిన్న కర్ర ఎలా పట్టుకున్నాడో ఈవేళకూడా అలాగే పట్టుకున్నాడు. నిన్న ఏ పొజిషన్‌లో ఉన్నాడో, ఈరోజుకూడా అదే పొజిషన్‌లో ఉన్నాడు. కనుక అది దిష్టిబొమ్మ కాదు గదా యని నా అనుమానంరా! అని అన్నాను.

ఔన్రోయ్! నిజమే. అది దిష్టిబొమ్మే అయుండవచ్చు, నువ్వు ముందునడు అని అన్నాడు. ఇద్దరం భయంతో, అనుమానంతో, ఆ మనిషిని సమీపించాం. మా ఆనందానికి అంతులేదు. అది నిజంగా దిష్టిబొమ్మే.

మా జేబులు పట్టినన్ని కాయలు కోసుకున్నాం. సంతోషంగా ఇంటికి వచ్చాం. కడుపునిండా కాయలు తిన్నాం. మర్నాడుకూడా ఆ దిష్టిబొమ్మను గూర్చే మాట్లాడుకున్నాం. దిష్టిబొమ్మ ఎంతపని చేసిందో చూశావా! అని అన్నాడు గోపి నాతో.

—(౦)—

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

ఆమె ఆలోచించింది. మొదటనుండి అతడి ప్రవర్తన, మాట్లాడే తీరు కనిపెట్టుతూనేవుంది. నవ్వుతూనే వలపన్నుతున్నాడనుకొని, తాను కూడ నవ్వుతూనే యీవలను త్రెంచుకొని పోవాలనుకుంది. కానియెలాగ? అయోమయమైన యీ వాతావరణంలో తాను బంధింపబడివుంది. తానైతే కృష్ణకుమార్‌ను కోరుకుంటోంది. కాని అతడు అందని పండేమో! మనోధైర్యంవుండి, పట్టుదల, కార్యదీక్ష వుంటే చెయ్యలేని పనియేముంది? ... అయినా సనాతన సాంప్రదాయాలు, నీతి నియమాలు అనే కట్టుబాట్లలో బంధింపబడి కదలడానికి వీల్లేకుండా వుంది. అయితే యీ కట్టుబాట్లను త్రెంచుకుని బైట పడే అదృష్టంతనకులేదేమో! తన ఆలోచనలు తన మీదనే తిరుగుబాటు చేస్తున్నాయి. తనకు ఆ యామినీ బాబునే రాసిపెట్టాడేమో ఆ బ్రహ్మ!

ఆమె ఆలోచనలన్నిటిని అతడు ఆమె ముఖంలోనే చూస్తున్నాడు. "అకారణంగా ఒకళ్లగురించి మనం ఆలోచించడమెందుకు? ఎవరి బాగోగులు వాళ్లేచూచుకుంటారు. ఎవరి ఖర్మ వారిది...." అని అతడు అంటూవుండగానే ఆమె లేచి తనగదిలోకి వెళ్ళిపోయింది. అతడు తనలోనే నవ్వుకుంటూ ఆమె వెళ్లినవైపే క్షణంచూచి నీలితో అన్నాడు. "మీ అక్క కోపంతో వెళ్ళిపోయింది. రామచంద్రకు యిస్తానన్నడబ్బు యివ్వవద్దని మేనేజరుతో చెప్తుందేమో! ఆమె చెప్పినమాట వినవద్దని ఆయనతో చెప్పిరా. ఇస్తానన్న డబ్బు యివ్వడమేగాని తిరిగి పుచ్చుకోవడమనేదిలేదు. ఆడిన మాట తప్పకూడదు ... ఒకవేళ కుమార్ తల్లిపిలిస్తే వెళ్ళండి. పాపం! నిస్సహాయిరాలు ఊళ్లోవాళ్ళందరూ యేడిపిస్తున్నారు. ఈవేళనుండి నూతినీళ్లుకూడ తోడుకోకుండాచేశారు. ఆ గురుదీన్ యేమన్నాడో మీరే చూచారుగా ..."

వెళ్లిపోతూవున్న నీలిని వెనక్కి పిలిచి" తమల పాకులు, పళ్లువున్నాయా?... లేకపోతే తెప్పించండి ... ఊళ్లో ఆడవాళ్ళందరు సాయంకాలం వస్తారు. ..."

## 13

సాయంకాలం నాలుగైంది. గ్రామంలోని ఆడవాళ్ళందరూ నిరుపమను చూడ్డానికి రావడంమొదలు పెట్టారు. వచ్చినవాళ్ళందరూ మధ్యహాలులో పరిచిన తివాసీపైకూర్చుంటున్నారు. అందరికీ ఒంటినిండా నగలు ముఖానికి పసుపు, పెద్దకుంకుమ బొట్టు. వచ్చినవాళ్ళలో నిరుపమకు యిదివరలో తెలుస్తున్న వాళ్లుకూడ వున్నారు. ఆమె వాళ్ళందర్నిగుర్తుపట్టింది. అందర్నీనవ్వుతూ పలకరించింది. చాలమంది కొత్తకోడళ్లుకూడ వున్నారు. వచ్చిన వారిలో రామరాణిని మాత్రం ప్రక్కనకూర్చోబెట్టుకుని మాట్లాడుతుంది. రామరాణి తన యీడుదే. తనచిన్ననాటి స్నేహితురాలు. నిరుపమ మొదటిసారి తండ్రివెంబడి రామాపురం వచ్చింది. అప్పుడే యీ రామరాణి స్నేహంకలిగింది. "అయినా యీ మెకువయస్సు యెంతవుంటుందో? ఇంగా పెళ్ళి కాలేదేమిటి?" అని అనుమానించసాగారు వచ్చినవారిలో కొంతమంది. "ఎంతవయస్సు వుంటేయేం? ఏదో యింత తండ్రి సంపాదించి పడేశాడు—జమీందారిణి అన్న పేరుంది. పెళ్ళికాక పోతుందా?" అనుకున్నారు కొందరు. గ్రామ విషయాలన్నిటి గురించి చర్చ ప్రారంభించారు ఆడవాళ్లు. కావలసింది, అక్కర్లేనిది అంటూ యేమీలేదు. మధ్యలో కృష్ణకుమార్ యింటి ప్రస్తావన వచ్చేసరికి నిరుపమ హృదయం ఆల్లాడిపోయింది యెందుకో.

"కుపుత్రుడు యేభైరూపాయలు పంపించాడు నిన్న" అంది వేణి బాబు భార్య అపహాస్యంగా.

"అని నీమొగుడు అంటున్నాడు ..." అంటూ గురుదీన్ భార్య ఇంకా ఏదో అనబోతుంటే—"అనవసరంగా మమ్మల్ని అనవద్దు. ఫలానా వాళ్లు అన్నారని చెప్తావెందుకు?...

ప్రపంచమే అంటోంది. ..." అంది వేణీబాబు భార్య.

"అయితే కావచ్చు కాని యీ గ్రామంలో మట్టుకు మీరే చెప్తున్నారు." ...అంది కోపంగా గురుదీన్ భార్య. ఆమె కోపాన్ని లక్ష్యపెట్టకుండా.

"అయితే నీతో వచ్చి చెప్పాడా ?"

"నాతో వచ్చి చెప్పడానికి – యిదేమైనా పరిహాసమనుకున్నారా" అంది కోపంగా.

ఇదంతా విని నిరు గాభరాపడింది. "ఏమిటి యిదంతా ?" అంటూ ఏమీ యెరుగనట్లు అడిగింది. ఎవ్వరు మాట్లాడలేదు. "ఏమిటమ్మా అసలు విషయం?" అంటూ వేణీబాబు పెళ్ళాన్నడిగింది.

"ఏమీ లేదమ్మా కృష్ణకుమార్ లక్నోలో బూటూ పాలిష్ చేస్తున్నాడట. ఇదంతా యేదో మేమే లేనిపోనిదంతా పుట్టించి చెప్తున్నామని యీమె అంటోంది. ఆవిణ్ణి యెవ్వరూ నూతిలో నీళ్ళుకూడ పట్టుకోనివ్వటంలేదు. ..."

ఇదంతా మహా ప్రళయంగా కన్పించింది నిరుపమకు, "నిజమే. బూట్‌పాలిష్ చేస్తున్నాడు. ఇందులో పెద్ద ఆశ్చర్యకరమైన విషయమేముంది. మా యింటికికూడ వచ్చాడు ..." అంది చిరునవ్వుతో.

"ఇప్పుడు చెప్పవమ్మా" అంటూ వేణీబాబు భార్య గురుదీన్ పెళ్ళాంవేపు విజయ గర్వంతో చూచింది.

"తప్పు అలా మాట్లాడకూడదు –" అంది నిరు

"దోషం యెవ్వరిదీ లేదమ్మా! ఈ రోజు దెబ్బలాడుకొంటారు. రేపు కలుసుకొంటారు. ... ఎవరు తవ్వుకున్న గొయ్యిలో వాళ్ళేపడతారు ..." అంది ఒక పెద్దామె.

"వాళ్ళమాట యిప్పుడెందుకు ? ఉంటారు పస్తారు"

"మొదట కలకత్తాలోవుండేవారు. తర్వాత కాన్పూరు వెళ్లారు. డబ్బు అయిపోగానే మళ్ళీ గ్రామం చేరారు. కేవలం సంవత్సరంన్నరకూడా కాలేదు ..."

"అసలు గ్రామంలో యెవ్వరితోను మాట్లాడరు"

"పరదేశస్థుల్లా గడుపుతున్నారు ..."

"ఉన్నదంతా తగులబెట్టి చేతులు కడుక్కుని కూర్చుంది. కాన్పూరులో వున్నయిల్లు కాస్త అమ్మేశారు. అక్కడ వున్నప్పుడు ఆ డబ్బుతోనే యింటి అద్దె చెల్లిస్తూవుండేవారట"

"అవును – మిగిలిన యీ కాస్తయిల్లుకూడ అమ్మేస్తారట"

"కేవలం పశువుల్ని కట్టడానికికూడా వీల్లేదు, ఆ యింట్లో"

"అసలు యీ గ్రామాన్నే విడలిపెట్టి వెళ్ళపోతాడని రామచంద్ర చెప్తున్నాడు."

ఈ సంభాషణలన్నిటిని వింటూ చూస్తూ కూర్చుంది నిరు. వచ్చినవారందర్నీ కలియచూచింది. రామచంద్ర తల్లి రాలేదు. తనూ వెళ్లలేదు. సురేష్ అయితే వెళ్ళమనే చెప్పాడు. తనకూ వెళ్లాలనేవుంది. కాని వెడితే – ఊళ్ళోవాళ్లు ఏమనుకుంటారో. ఆలోచిస్తోంది. అన్నగారు నీలితో అన్నమాటలన్నీ తను వింది. సిగ్గు భయము ఆమెను ఆవహించాయి. తాను వస్తానని కబురుపంపిందిగా. అందుకే ఆమె రాలేదేమో ! వెళ్లకపోతే బాగుంటుందా ? ఇలా నిరు ఆలోచిస్తూనే కూర్చుంది. అందరూ ఏవేవో మాట్లాడుకుంటున్నారు. ఇంతలో సంధ్యాసమయమైంది. అందరికీ బొట్టుపెట్టి, తాంబూలాలిచ్చి నమస్కారం చెప్పి గుమ్మందాకా వెళ్ళి సాగనంపింది.

## 14

మరునాడు నిరు కుమార్ యింటికి వెడదామనుకుని అనేకసార్లు గుమ్మందాకా వచ్చేదికాని అడుగు ముందుకు పడేదికాదు. సురేష్ మనసులో యేయే భావాలైతే ఉద్భవించాయో అంతకన్న సిగ్గుపడాల్సినదేముంటుంది. నీలిలాగ తాను అన్నగారి ముందుకు పోలేదు. అన్నగారు వెళ్ళమన్నా అతని మాటలు తీరు ఆమెకు చాల అపహాస్యంగా తోచింది. చిన్నప్పనుండి యిద్దరూ కలిసిమెలిసి పెరిగారు. ఆ చిన్ననాటి స్నేహాన్ని ఒకనాడు అమాంతంగా త్రెంచలేదు. అయినా తన అన్నగారేగా !

మనుష్యత్వాన్ని గూర్చి ఆలోచించడంమొదలుపెట్టింది. కుమార్ తల్లి యేమనుకుందో ? అయినా ఊళ్ళోవాళ్ళందరూ ఆమెను నానాహింసలుపెడుతూవుంటే – యీ జమీందార్ని చూస్తూకూడా అన్న

గారు ఏమీ చేయలేక పోవడం సాగదా ఉన్న ఆస్తిని కూడా లాక్కున్నాడు. ఎంతకాలం వాళ్ళిలా గడుపుతారు? తాను చదువుకున్నవాడై వుండి కూడా మరొక చదువుకొన్నవాడికి సహాయం చెయ్యలేకపోయాడు. యీ సామాజిక బంధనాల నుండి అతన్ని తప్పించలేకపోయాడు. పైగా తన స్వార్థాన్నే చూసుకున్నాడు. ఎవరెట్లాపోతే తనకేం? ... యామినీబాబుకు యెందుకు డబ్బు కావలసి వచ్చిందీ తనకిప్పుడు అర్థమైంది. కుమార్ బాబు తండ్రి కాన్పూరులో తనకున్న రెండిళ్లను యామినీ బాబు తండ్రివద్ద తనఖా వుంచాడు. కాని అతను ఆ బాపతు డబ్బు పూర్తి చెల్లించనందున ఆ యిల్లు తన పేర రిజిష్ట్రీ కాలేదు. ఆ బాకీ తీర్చడానికే యామినీ బాబుకు యిప్పుడు డబ్బు కావలసి వచ్చింది. అవును. యీ డబ్బు యెల్లాగైనా కుమార్ బాబుకే దక్కుతుంది కాబట్టి తాను తప్పక డబ్బు యివ్వాల్సిందే! అయితే ఆ యిల్లు? ... ఆలోచించి ఆఖరికి డబ్బు యివ్వడానికే నిశ్చయించుకుంది. అసలు రామచంద్ర చదువుకు తానెందుకు డబ్బు యిస్తానంది? తాను వాళ్ళింటికి రాలేదనే కోపంతో ఆ డబ్బు కూడ ఆమె తీసుకోదేమో! ఆ ఆలోచనలతో ఆమెలో ఆవేశం రేకెత్తింది. ఎల్లాగైనా సరే కుమార్ బాబు యింటికి వెళ్ళాలని నిశ్చయించుకుని గుమ్మందాకా వెళ్ళింది కాని ... మళ్లీ యేమనుకుందో వెనక్కు వచ్చేసింది. సిగ్గుతో - వాడిపోయిన ముఖంతో — అసభ్యమైన వ్యవహారాల వల్ల కలిగిన ఆందోళనను తనలోనే అణచుకొంటూ గదిలో కూర్చుంది.

నీలికి కూడా కుమార్ బాబు యింటికి వెళ్ళాలనే వుంది. అన్నయ్య వెళ్ళమన్నాడుగా. మరి అక్క యెందుకు రాదు? నీలికేమీ అర్థంకాక అక్క దగ్గరకు వెళ్ళింది. "అక్కా రామచంద్రయింటికి వెళదామా? వాళ్ళమ్మగారు రమ్మన్నారుగ! అన్నయ్య వెళ్ళమన్నాడు. నువ్వేకదూ మొదట వెళదామన్నావు"

"ఊళ్ళోవాళ్ళందరూ వాళ్ళింటికి వెళ్ళడం మానేశారు. ఇప్పుడు మనం వెడితే బాగుండదు— నువ్వుకూడ వెళ్ళవద్దు."

నీలికి కోపంవచ్చింది. ఎవరిమీద? ఆమె ముఖంలోనే కోపం కన్పించింది నిరుపమకు. వయస్సులో చిన్నదైనప్పటికి తెలివితేటలున్నాయనుకుంది. నీలి ఆలోచిస్తూనే కూర్చుంది. ఊళ్ళోవాళ్లందర్లోకి ఆవిడే మంచిది. అటువంటి వాళ్లింటికి వెళ్ళకపోవడమేమిటి? ఆవిడ రాకపోతే పోయింది — నేనెందుకు వెళ్ళకూడదు? ... " అనుకుంది.

ఆరోజంతా నిరు, నీలి గుమ్మందాటి బైటికి రాలేదు. సాయంకాలం సురేష్ అడిగాడు "ఎక్కడకైనా వెళ్ళారా?" అని లేదనే సమాధానంవచ్చేసరికి సంతోషించి "ఈ వాళ రామచంద్ర తల్లి నిన్ను పిల్చింది కాని నువ్వు వెళ్ళకపోవడమే మంచిదయింది. ఇప్పుడు నువ్వు వాళ్లింటికి వెళ్ళి, మరొకళ్లు పిల్చినప్పుడు వెళ్ళకపోతే బాగుంటుందా? అలా ఎంతమంది యిళ్లకని వెడతాం. ఈ మర్యాదలన్నీ నీకు అర్థంకావు. రామచంద్ర తల్లి యిక్కడకు రాగలదు. కాని రాలేదు. అందుకు అనేక కారణాలు వుండవచ్చు; నువ్వు ఆవిణ్ణి పిలవవద్దు. పిల్చి తను రాకపోయిందంటే మనకే అవమానం. మనం జవానుతో చెప్పి పంపిద్దాం — వారికి యిస్తామన్న యిరవై రూపాయలు ప్రతినెల పంపుతామని..." అన్నాడు. నిరుపమ కాని, నీలి కాని యేమీ మాట్లాడలేదు. తను చెప్పేదానికి యిద్దరూ కూడ నిర్లక్ష్యంగా వున్నట్టు కన్పించడంవల్ల కోపంగా వెళ్ళిపోయాడు.

తెల్లవారేసరికి సావిత్రీదేవి అనేకరకాల పిండి వంటలు చేసి నిరుపమ రాకకై యెదురుచూస్తోంది. పది పదకొండు — పన్నెండయింది. నిరు రాలేదు ఆఖరికి పన్నెండు దాటినతరువాత రామచంద్రకు అన్నంపెట్టి కుమార్ బాబుకు ఉత్తరం వ్రాసింది. ఆవిడ మనసులో అనేకరకాల భావాలు చెలరేగుతున్నాయి. తాను నిరుపమను తనయింటికి ఆహ్వానించడంలో ప్రత్యేకత యేమీ లేదు. మామూలుగానే, మంచిఅభిప్రాయంతోనే ఆహ్వానించింది, అయితే, ఆమె నిరుపమ - జమీందారు కూతురు లేక తన గ్రామానికి జమీందారిణి — యేమీ ఆలోచించలేదు. నిన్ననేగా చెప్పింది వస్తానని. రాలేదు. అయినా ఆమె మాటల్లోనే తెలుస్తుంది వ్యవహారమంతా. రామచంద్రచదువుకోసమని నెలకు యిరువైరూపాయిలు పంపిస్తానని చెప్పిందిట అంటే అప్పటికి తాము బీదవాళ్లము, చదువు చెప్పించలేని వాళ్లమనేగా, అందుకోసమేనేమో — తాను బీదవాళ్లింటికి వెళ్లడం ఉచితం కాదనుకుందేమో! అయినా ఆమె మంచిదే అన్నగారే వెళ్లవద్దన్నాడేమో! పైగా ఊళ్లోవాళ్లందర్నీ చూచి భయపడివుంటుంది. ... నిన్న అందరూ ఆమెను చూడ్డానికి వెళ్ళినప్పుడు తానుకూడ వెళ్లే

దని కోపం వచ్చిందేమో? ... నీలికూడ రాలేదు. అయినా ఒకళ్లు మనింటికి యెందుకు రావాలి? మనం పిలుస్తే మాత్రం? ... సావిత్రీదేవి భోజనం చెయ్యకుండా కూర్చుని యేదేదో ఆలోచిస్తోంది.

సావిత్రీదేవి మనోధైర్యంగల వ్యక్తి. కష్టాలనేమహా పర్వతంఒకవైపు మీదపడుతున్నా తను నీతినియమాలనువదలిపెట్టక సమర్థించుకుంటూ వస్తోంది. కుమార్ విదేశాలకు వెళ్లి చదువుకుంటాననే అభిలాష పడినప్పుడు భర్తతో వాదించి కొడుకును విదేశాలకు పంపింది. డబ్బు లేకపోతే కాన్పూరులో వున్న రెండిళ్లు తనఖా పెట్టించింది. భర్త పోయినా, పరిస్థితుల ప్రభావంవల్ల అణగిపోయినా — ఆఖిరికి పిడుగులు మీదపడుతున్నా - సంసారాన్ని యింతవరకు యే ఒడుదుడుకు లేకుండా నెట్టుకొచ్చింది. ఇటువంటి పరిస్థితులలోకూడ మాలిక్యాతల్లిని ఊళ్లో వాళ్లెవ్వరూ చేరనివ్వకపోతే ఆమె పోషణబాధ్యత కూడ తానే వహించింది. ఊళ్లోవున్న నూతినీళ్లు పట్టుకోనివ్వకపోతే ఊరిబైట తోటలోవున్న బావినుండి నీళ్లు తీసుకురావడం తన కవమానమని ఆవిడ అనుకోలేదు. ఆఖరికి ఉన్న యెకరం భూమినీ, తోటను జమీందారు వశం చేసుకున్నా ఆమె బాధపడలేదు. కొడుకు విదేశాలకువెళ్లి చదువుకుని వచ్చాడు. దాని విషమఫలితాలు యెలా వున్నాయో తానిప్పుడు ప్రత్యక్షంగా చూస్తోంది. కొడుకు పరిస్థితి యేమీ బాగులేదు. అయినా, ఆ తాపాన్ని తనలోనే అణచుకుంటూ దానివల్ల కలిగే అన్ని అపనిందల్నీ శిరసావహిస్తోంది. ఈ పరిస్థితుల ప్రభావం యిప్పుడు రామచంద్రమీద పడకుండా చూడాలి. అదే తన ప్రధాన కర్తవ్యం. అందువల్లనే తాను లోలోపల యెంతబాధతో కుమిలిపోతున్నా కొత్త కొత్త విషయాలు చెప్పుతూ అతణ్ణి సంతోషపెట్టేది. నిరు చాల బుద్ధిమంతురాలు. తన పరిస్థితుల్ని ఆమె బాగా అర్థంచేసుకుంది. చదువుకున్న బెంగాలీ యువతైనా ఆమె తనయెడ యిటువంటి ఆదరాభిమానాల్ని చూపిస్తుందని ఆమె యెప్పుడూ అనుకోలేదు... ఆ నాడు గ్రామంలో జరిగిన విశేషాలన్నీ మాలిక్యాతల్లి చెప్తుంటే సావిత్రీదేవి ప్రశాంతంగా వింటోంది.

(సశేషము)




శ్రీ S. K. రాజేశ్వరీరాణి

"ఆ అమ్మాయి ఎవరో తెలుసా ?"

"తెలియదండి" బాధగా జవాబిచ్చాడు రామం. రిక్షాలో ఇద్దరు యువతులు పోతున్నారు. ఒకావిడ ముఖం అవుపడలేదు. రెండో ఆవిడ వీళ్ళనిచూడ లేదు. రిక్షారివ్వున వెళ్లిపోయింది దృష్టిపథంనుంచి.

నాగన్ నిట్టూర్చాడు...ఆ "రిక్షావాడు పూజ చేసుకొన్నాడు. ఏమంటావు రామం ?"

రామం తిరుగామూలిగాడు 'అవునండి'

"ఏంరామం ఇలానిరుత్సాహంగావుండే వాళ్లని చూస్తే నాకెందుకో కడుపులో మంట బయలు దేరుతుంది. అన్నిటికీ ఇచ్చిపెట్టుకోవాలి, హుఁ" ... తనతో బాహాటంగా సినిమాకు రిక్షాలో బయలుదేరని అన్నపూర్ణని తల్చుకొనికూడా హుంకరించాడు.

"గుమాస్తాగాళ్ళకేం వుత్సాహంలెండి" రామం ఏదో ఒకమాటనాలని అన్నాడు.

నాగన్ రామంని ఎగాదిగా చూసాడు. "రామం! కాలేజీలోవున్నప్పుడు మనం ఎంత అల్లరి చేసేవాళ్లం? పదేళ్ళుగా ఇద్దరం చూడలేదనుకో. నువ్వు ఒక గుమాస్తా అయిందానికి నేను ఓ మేనేజర్ అయిందానికి...అండి, అంటూ ఏదో నిరుత్సాహంగా మాట్లాడుతున్నావు ... ఒక్కమారు కాలేజి తలపులు జ్ఞప్తికితెచ్చుకో రామం! అరవై ఏళ్ళముసలి వాడిలా మాట్లాడుతున్నావు; అబ్బ : ఇంట్లో ఆ అన్నపూర్ణ అలాగే దాపురించింది. ఈ వేదాంతం నాకిష్టంలేదు. పాపం, పుణ్యం అని అంతా. భ్రమ బ్రదర్ ! మరో జన్మవుందో లేదో తెల్సానీకు? మనవాళ్ళేదో రాసారు ... అది చదివి మరంతా రేపు ఏం జరుగుతుందో లేదా మరో సెకండుకేం జరుగుతుందో తెల్సుకోలేని...భయస్థులు భయపడి పోతున్నారు. ఛ్ ; బ్రతికినన్ని రోజులు జల్సాగా బ్రతకాలోయ్ ! ఇహ నన్ను అండి గిండి అన్నావంటే బావుండదు. ఇది ఆఖరిసారి చెపుతున్నా ... డబ్బుకావాలా : అడుగు మొహమాటము-సరే ... ఇహ నుంచి నీజీతం మూడొందలు... చాలా .... పిల్లలొచ్చిన కాలానికి మరో రెండు వందలు జాస్తిచేస్తాలే...రామం .. నువు కాలేజిరామం కావాలిరా...అవును ... మారిపో ... మారు ... మారిపోతానంటావా లేదా ! చెప్పు ... చెప్పు ..."

రామం నాగన్ నోరు మూసాడు "ఏమిటిరా...అవంతా కాలేజి చదివేటప్పుడు- నువ్వు నన్నిలాబలవంతంచేస్తే ఎలాగరా ...సరే .. అరవ్వాకు ... మారిపోతా!"

నాగన్ రామం భుజాలు ఆనందంగా ఊపాడు, మరి నాపేరు ..."

"శేష్ నాగం"

"ఆ...అలారా ... దారికి. ఇందాక రిక్షాలో ..."

రామం గతుక్కుమన్నాడు, రాధ ఎవరితో పోతున్నది రిక్షాలో ... ఈ వూళ్లో స్నేహితులున్నారని చెప్పనేలేదే తనతో అదీను .. క్రొత్తవూరిది .."

"తెల్సానీకు" ... నాగన్ ఆత్రంగా అడిగాడు.

"కనుక్కొంటూరా" రామం అదిరిపడి అన్నాడు.

నాగన్ నవ్వాడు "ఇప్పుడేంది. కాలేజి టైమునుంచి నువుగా నాకు దేవుడివి. డబ్బు పిశాచానివి అప్పుడు. ఇప్పుడేమన్నా మా రావా!"

"జీతం పెంచావుగా ... చాల్లే .."

"అలా కాదురా ... ఇదిగో ... రెండొందలు ..."

"నాగం!... నువ్వు నోరు మూసుకొంటావా లేదా?"

నాగం నిట్టూర్చాడు "ఓరి నీ ఇల్లు కూలా! కాలేజిరామం అయ్యావా; అది సరేకానీ ఆఫీసులోనా చెవులు నులమువాకు"

♦ ♦ ♦

"నన్ను క్షమించు అన్నపూర్ణా!"

"నన్ను క్షమించురాధా! సత్యాగ్రహంకూడా చేసాను. వారికీ కోరికవున్నట్టు మొదటనాకు తెలియదు. మా నాన్న డబ్బు, హోదాకు ఆశపడి నన్నిక్కడ ఇచ్చాడు. కానీ మా అత్తగారు వున్నంత వరకూ నన్నుకంటికి రెప్పలా చూసారు రాధా! పెండ్లి చేస్తే కొడుకు బాగుపడుతాడని ఆశించిందామె. పెండ్లయి నేనొచ్చాను. ఆయన ఆటలు మితిమీరి పోయినవి. కొత్తలో జంకేదాన్ని, మాట్లాడకుండావుంటే అలానే వెళ్ళిపోయేవారు. ఆ తర్వాత కొద్దికొద్దిగా కోపంచేసుకొన్నట్లభినయించేదాన్ని. ఫలితంలేదు, ఛీ అని వదిలేశాను. అందమైన భర్త, ఐశ్వర్యవంతురాల్ని. నేను స్వర్గభోగం అనుభవిస్తున్నానని అనుకోవచ్చు అందరూ! కారణం ఇది వారి మనసుకినాటిన స్త్రీతో కలవకుండా వుండిపోరని మాత్రం తెల్సుకొన్నాను. ఈ తడవ ఆయన కామాగ్నికి నువే బలి అవుతావనిమాత్రం అనుకోలేదు రాధా! అందుకేనిన్ను నన్నుచూడను చెప్పకుండా రావద్దని చెప్పాను. రాధా! నన్నేంచెయ్యమంటావు?" అన్న పూర్ణ దీనంగా అడిగింది. రాధ దీర్ఘనిట్టూర్పువదిలి అంది. 'వారు, మీవారు చిన్ననాటిస్నేహితులేనటఅక్కా!.. మొన్న మనం చందూలాల్ షాపుకు వెళ్ళివస్తుంటే వాళ్ళిద్దరూ చూసారుట, నువగుపడలేదట. నేనేమో వాళ్ళని గమనించలేదు. ఆయనకూడా చాలా లోగుట్టుమనిషి అన్నపూర్ణా! డైరీలోచాలా బాధగా రాసుకొనివున్నారు. నాతో ఆయన ఒకమాదిరిగా వుంటున్నారు . ఏమిటో కారణంఅనుకొన్నాను. చెప్పకుండా నీతో షాపింగుకు వచ్చానే అదనుకొన్నాను. కాని ఆయన చెప్పలేదు. లోలోపల బాధపడుతున్నాడు. గుచ్చి అడి

గితే నాతలరాత అన్నాడు. మళ్ళా ఆ ఉద్యోగమేమన్నా పోయిందేమోఅనుకొని అడిగితే "నువ్వుక్షేమంగా వున్నంతవరకు నాకుఉద్యోగానికిడోకాలేదులే" అన్నాడు, నామనసు చివుక్కుమంది. ఎప్పుడు విసుక్కోనివాడు. నేనంటే ప్రాణం ఇచ్చే ఆయన అలాఅన్నాడు అంటే ఏదో కారణముండాలి అనుకొన్నాను. అలా ఆయన వెళ్ళింతరువాత ఎందుకో ఆయన డైరీ చూడాలనిపించిచూశాను. "రాధా! నీ శీలం రక్షిస్తాను. కనీసం ఒక సోదరి శీలాన్నయినా రక్షిస్తాను." ఎందుకో అన్నపూర్ణ పిచ్చిగా నవ్వుతూ రాధ చెవిలో ఏదో రహస్యం చెప్పింది..

♦ ♦ ♦

"నాగం! ఇక్కడేవున్నావా?"

"ఏం? మనకు వేరే ప్రోగ్రాముంది భాయీ! ఛాన్సర్ ఒకటివచ్చిందిలే, రేపుండదు. ఆ ఛాన్సు వాసన్నుతీసుకోమన్నాను.

రామం వులికిపడ్డాడు. నాగంని ఉద్ధరించాలని అతన్ని ఆ వీధినుండి మలుపు తప్పించాలని రాధ చెప్పిన పథకం విని ఆనందించాడు, రామం. ఆపథకం అన్నపూర్ణ చెప్పిందే రాధకు. వానికథ అడ్డం తిరిగినందుకు రామం అదిరిపడ్డాడు.

"నాగం! వాసన్ మీఇంటికి వెళ్ళిపోయాడు?"

"ఏం? పిట్ట గూట్లోనేవుందిలే చూసే వచ్చాను; అదే చీర ...."

"నాగం!" రామం మాట్లాడలేక పోయాడు. నాగం అర్థంకాక నిలపడ్డాడు.

"నాగం! త్వరగా ఇల్లుచేరు" రామం మరి మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

నాగన్ ఆశ్చర్యంగా ఇంటికొచ్చాడు. అప్పుడే తలా, బట్టలూనలిగి సవరించుకొంటూ విసవిసనడిచిపోతున్న వాసన్ని చూసాడు. వాసన్ నాగన్ని చూడలేదు. నాగన్ వాసన్ని పలకరించలేదు. నేరుగా లోనికొచ్చాడు. ఆ గదిలో "అన్నపూర్ణ "వెల్లకిలపడివుంది. గుండెల్లోగుచ్చుకొన్న .... పండ్లుకోసేకత్తి .... నెత్తురు కారుతోంది ... నాగన్తల తిరిగిపోయింది, అన్నపూర్ణేగుచ్చుకొందా కత్తి"

అన్నపూర్ణలో . చలనంలేదు, నాగన్ విరుచుకొని పడ్డాడు క్రింద ... అన్నపూర్ణ అంటూ!



# దశావతారములు

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ

(గతసంచిక తరువాయి)

## శ్రీరామావతారము

శ్రీమన్నారాయణుని నాభికమలమునుండి బ్రహ్మ పుట్టెను. బ్రహ్మ పుత్రుడు, మరీచి. మరీచి కుమారుడు కశ్యపుడు. కశ్యపమహర్షి సుతుడు సూర్యుడు. సూర్యుని కుమారుడు వైవస్వతమనువు. మనుసూనుడు ఇక్ష్వాకు. ఇక్ష్వాకుని వంశమున కకుత్స్థుడను వాడు పుట్టెను. వానివంశమున రఘుమహారాజు పుట్టెను. రఘుమహారాజు కొడుకు అజమహారాజు. అజమహారాజు తనుజుడు దశరథ మహారాజు. రావణాది రాక్షసులను చంపుటకై స్వయముగా విష్ణుభగవానుడు అనపత్యుడైన దశరథ మహారాజు పుత్రకామేష్టి చేసినపుడు ఋష్యశృంగుడిచ్చిన పాయస ప్రభావము వలన తాను నాలుగు భాగములై కౌశల్యకు శ్రీరామచంద్రుడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును అయి పుట్టెను. ఒకానొక దినమున విశ్వామిత్ర మహర్షి దశరథమహారాజు వద్దకు వచ్చి తాను జేయు యజ్ఞయాగాదుల సంరక్షణార్థమై బాలకులైన శ్రీరామలక్ష్మణుల నివ్వుమని కోరెను. దశరథ మహారాజుకు లేక లేక కలిగిన పిల్లలను పంపుట ఇష్టము లేకపోయినను ఋషి కోపించి శపించునేమో యను భయముచే శ్రీరామలక్ష్మణులను విశ్వామిత్ర మహర్షి వెంట బంపెను. రామలక్ష్మణులు మహర్షి వెంట వెళ్లి ఆయనవలన అస్త్రశస్త్రములందు శిక్షితులై తాటకి యను రాక్షసిని జంపిరి. మారీచుని మోహనాస్త్రముచే పడగొట్టిరి. విశ్వామిత్రమహర్షి చేయు యజ్ఞములకు విఘ్నము లొనరించు సుబాహుడను రాక్షసుని జంపిరి. అనంతరము రామలక్ష్మణులు విశ్వామిత్రునితో సహా జనకపురికి వెళ్లిరి. అచట శివధనుస్సును శ్రీరామచంద్రుడు అతిలీలగా రెండు ముక్కలు చేసి సీతామహాలక్ష్మిని పెండ్లియాడి అయోధ్యకు తిరిగి వచ్చెను. అయోధ్యావాసులెల్ల శ్రీరామచంద్రుని గుణములు చూచి వానియందు మిక్కిలి యనురాగము గల్గియుండిరి. శ్రీరామచంద్రునకు దశరథ మహారాజు యువరాజ పట్టాభిషేకము చేయబోవ ఆ సంగతి కైకేయి సఖురాలైన మంధర యను కుబ్జ తెలుసుకొని, పూర్వమేదో యపరాధము చేసినపుడు శ్రీరాముడు తనను కాళ్లుపట్టి యీడ్చివేసెనను కోపముతో వానికి ప్రతీకారము చేయవలయునని నిశ్చయించినదై వెంటనే కైకేయి వద్దకు వెళ్లి రామపట్టాభిషేకముహూర్తము చెప్పి భరతునకు రాగిచెంబు తప్ప వేరొకగతి లేదని వర్ణించెను. అంత కైకేయి దీనురాలై అమ్మా, మంథరా! నా పుత్రునకు రాజ్యము లభించు ఉపాయమున్నదా యని యడిగెను. అపుడు మంధర కైకేయికి దశరథ మహారాజు ఇచ్చిన రెండు వరములను జ్ఞాపకము చేసి యిట్లు చెప్పెను. కైకేయీ! నీవు వెంటనే దశరథ మహారాజు వద్దకు వెళ్లి ఒక వరముతో శ్రీరామునకు వనవాసము, రెండవ వరముతో భరతునకు పట్టాభిషేకము కోరుకొనుము. ఇది మంచి యుపాయమని చెప్పి వెంటనే కైకేయి మంధర చెప్పినట్లుగా దశరథ మహారాజును కోరెను. సత్యవచన బద్ధుడైన దశరథ మహారాజుకు రెండు వరములివ్వక తప్పినది కాదు. శ్రీరాముడు తండ్రిగారి యాజ్ఞను పాలించుటకై నరణ్యమునకు పోయెను. వాని వెంబడి అనుజుడు లక్ష్మణుడు, భార్య సీతమ్మ వెళ్లిరి. ఆ సమయమున భరతుడు మేనమామగారి యింట ఉండెను. పుత్రులెవరు దగ్గఱలేని సమయమున దశరథ మహారాజు దివంగతుండయ్యెను. తండ్రి మరణవార్త విని భరతుడు అయోధ్యకు వచ్చి సంగతి అంతా తెలుసుకొని తల్లిని దూషించి నాకు రాజ్యము వద్దని చెప్పి నారబట్టలను ధరించినవాడై వసిష్ఠాదులను ముందు నిడుకొని భరద్వాజాశ్రమమును దాటి రామలక్ష్మణులున్నచోటికి వచ్చి అన్నా! నాన్న దివంగతుడైనాడు. నాకు రాజ్యము వద్దు. నీవు రాజ్యమును గ్రహింపుము. నీవంతు నేను వనమునకు వెళ్లెదనని చెప్పెను. మొండి పట్టుపట్టి కూర్చొనియున్న భరతునకు శ్రీరాముడు తన పాదుకలనిచ్చి పంపివేసి దండకారణ్యమును ప్రవేశించి పంచవటి ఒడ్డున పర్ణశాలను నిర్మించుకొని నివసించుచుండెను. ఒకనాడచటకు శూర్పణఖ యను రాక్షసి వచ్చి సుందరాంగుడైన శ్రీరాముని జూచి

పెండ్లియాడమని కోరెను. శ్రీరామునిచే ప్రేరేపింపబడిన లక్ష్మణుడు ఆమె ముక్కు, చెవులు కోసి పంపివేసెను. అంత యామె కోపించినదై తన సోదరులైన ఖరదూషణాదులతో జరిగినదంతయు జెప్ప వారు రామునిమీదకు యుద్ధమునకువచ్చి యుద్ధములో హతులైరి. వెంటనే శూర్పణఖ రావణాసురునితో ఖరదూషణాదుల మరణవార్తనుగూర్చి జెప్పెను. అంత రావణుడు మారీచుని నీవు మాయాలేడివై సీతమ్మయెదుట గంతులు వేయుచుండుము అని చెప్పి తానుకూడ మాయవేషమును వేసుకొని, మాయలేడి కొరకై రాముడును రామునకేదో యపచారము జరిగినదని లక్ష్మణుడు వెళ్లినపిదప సీతమ్మవద్దకు వచ్చి ఆమెను మాయచేసి అపహరించి లంకకు గొనిపోయెను. తిరిగివచ్చిన రామలక్ష్మణులు సీతను గానక వెక్కి వెక్కి ఏడ్చుచూ వనములన్నియు వెతుకుచూ దారిలో జటాయువును చూచి దానివలన రావణుని చేత తనభార్య అపహరింపబడినట్లు తెలుసుకొని, పోవుచూ దారిలో కబంధుడను రాక్షసుని జంపెను. కబంధుడు శాపవిముక్తుడై శ్రీరామా నీవు సుగ్రీవుని వద్దకు వెళ్లుము. నీ కార్యసిద్ధి కాగలదని చెప్పెను. అంత శ్రీరాముడు ఋష్యమూకమునకు వెళ్లి హనుమంతుని ద్వారా సుగ్రీవుని స్నేహము బొంది ఒక్క బాణముతో ఏడు తాడిచెట్లను ఛేదించి సుగ్రీవుని యన్నయగు వాలిని జంపి సుగ్రీవునకు కిష్కింధా రాజ్యమును వాలిచే అపహరింపబడిన భార్య తారను వప్పగించెను. శ్రీరాముని ఉపకారము పొందిన సుగ్రీవుడు నలుదిశల కపులను సీతను వెతుకుటకై పంపెను. వారిలో దక్షిణదిక్కు వెతుకుటకై బయలుదేరిన హనుమంతుడు వారిధిని దాటి లంకనుచేరి అశోకవృక్షము క్రిందనున్న సీతనుచేరి రాముని కుశలవార్త ఆమెకు చెప్పి గుర్తుగ శ్రీరాముడిచ్చిన యంగులీయకమును ఇచ్చెను. ఆ యంగులీయకమును సీతమ్మ తీసుకొని కళ్లకద్దుకొని తన్ను హనుమంతు చూచినట్లు గుర్తుగ మణిని యిచ్చి కాకాసురుని కథకూడ రామునితో చెప్పుమని చెప్పెను. హనుమంతుడు సీతమ్మనుండి సెలవు తీసుకొనిపోయి ఆ వనములో కొన్ని కోతిచేష్టలు చేయగా రాక్షసులు చూచి వానిమీదకు యుద్ధమునకు రాగా అక్షయకుమారాదులను హనుమంతుడు చంపెను. చివరకు రావణపుత్రుడైన యింద్రజిత్తు కోపించి నాగపాశముచే వానిని బంధించి రావణుని వద్దకు తీసుకొని వెళ్లెను. రావణుడు నీవెవ్వరవని యడుగ నేను రాముని బంటును; ఆంజనేయుడు నా పేరు అని చెప్పెను. దూతను చంపకూడదని చెప్పి వానితోకకు గుడ్డలుకట్టి కిరసనాయిలుపోసి అంటించిరి. వెంటనే ఆంజనేయుడు ఎగిరెగిరి ఆ మంటలతో లంకనంతను కాల్చి సీతమ్మ గుర్తుకురాగా తిరిగివచ్చి ఆమె భద్రముగా ఉన్నదీ లేనిదీ చూచి కిష్కింధకు వెళ్లి జరిగినదంతయు శ్రీరామాదులతో చెప్పి సీతమ్మ యిచ్చిన మణిని సమర్పించి కాకాసురుని కథ చెప్పి రాముడు పోయినదుఃఖము కలవాడై నీలుడు మున్నగు వానరుల సహాయమువలన సముద్రముపై సేతువుకట్టి దానిని దాటి లంకనుచేరి రావణ కుంభకర్ణాదులతో ప్రచండయుద్ధముచేసి వారిని హతమార్చి విభీషణునకు లంకా రాజ్యమును వప్పగించి పుష్పక విమానములో కూర్చొని సుగ్రీవుడు, హనుమంతుడు మున్నగువారితో సహా నందిగ్రామములో శ్రీరామ పాదుకలను పూజించుచున్న భరతునివద్దకు వెళ్లి వానిని కౌగలించుకొని వానితో అయోధ్య వెళ్లి వసిష్ఠాదులకు, తల్లులకు నమస్కరించి యనంతరము పట్టాభిషిక్తుడై కొన్ని వేల సంవత్సరములు రాజ్యము చేసెను. ఈ విధముగా నారాయణుడు శ్రీరామావతారము నెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసెను.

## శ్రీకృష్ణావతారము

శ్రీ మహావిష్ణువు నాభికమలమునుండి బ్రహ్మ పుట్టెను. బ్రహ్మపుత్రుడు అత్రిమహర్షి. అత్రిమహర్షి సూనుడు సోముడు. సోముని పుత్రుడు పురూరవుడు. పురూరవుని సుతుడు ఆయువు. ఆయువు కుమారుడు నహుషుడు. నహుషుని పుత్రుడు యయాతి. యయాతి భార్య శర్మిష్ఠ. వారికి యదు, తుర్వసు, ద్రుహ్యు, పూరు అను నలుగురు పుత్రులు, దేవయాని అను కూతురు గలిరి. వీరిలో యదు అను వాని వంశములో పుట్టినవారు యాదవులని పిలవబడుచున్నారు. యాదవులలో వసుదేవుడనువాడు ఉత్తముడు. వాని భార్యపేరు దేవకి. దేవకి సోదరుడైన కంసుడు దేవకియొక్క మొదటి ఆరు గర్భములను విచ్ఛిత్తి గావించెను. ఏడవ గర్భమున కంసునకు తెలియకుండ బలరాముడు జనియించెను. ఎనిమిదవ గర్భమున రోహిణీ నక్షత్రయుక్త కృష్ణాష్టమినాడు అర్ధరాత్రివేళ శ్రీమన్నారాయణుడు దేవకి గర్భమున చతుర్భుజుడై జన్మించెను. దేవకీ వసుదేవులు స్తుతింప రెండు బాహువులు గలవాడయ్యెను. దేవకి కంసుని భయమువలన తనకు పుట్టిన శిశువును యశోదప్రక్కలో పరుండబెట్టి అదేసమయమున యశోదకు పుట్టిన శిశువును తాను గ్రహించి ఆ శిశువునే తన శిశువని

ప్రచారము చేసెను. అంత కంసుడు దేవకి ప్రసూతి గృహమునకు వచ్చి దేవకి ఎంత నివారించుచున్నను వినక ఈ ఎనిమిదవ గర్భము నాకు మృత్యువని చెప్పి దేవకి చేతిలోని ఆడశిశువును తీసుకొని రాతిపలక మీద వేసి కొట్టెను. అప్పుడు జనులంతా అచ్చెరువు నొంది చూచుచుండ ఆ బాలిక ఆకాశముపైకి ఎగిరి, ఓ కంసా! జగన్నాథుడైన విష్ణుభగవానుడు భూభారహరణార్థమై బాలుడై పుట్టియున్నాడు. అతడు నిన్ను చంపగలడు అని చెప్పి యంతర్ధానము జెందెను. శ్రీకృష్ణుడు గోకులమున యశోద యింట్లో పెరుగుచుండెను. శ్రీకృష్ణుడు బాల్యమునుండియు గొప్ప పరాక్రమము గలవాడై యుండెను. కంసుడు కృష్ణుని జంపుటకై పూతనను పంపెను. పూతన పాలిచ్చు మిషతో కృష్ణుని చంపబోవ శ్రీకృష్ణుడు పాలతో పాటు ఆమె రక్తమునుగూడ పీల్చివేసెను. అనంతరము శ్రీకృష్ణుడు బాల్యములోనే బృందావనము వెల్లి యచట యమునా నదినుండి కాళీయమను సర్పమును మర్దనము చేసి బయటకులాగి దానిని సముద్రములో పడవైచెను. అనంతరము అరిష్టవృషభుడను రాక్షసుని, గుఱ్ఱము రూపముదాల్చిన కేశి యనే దానవుని జంపెను. కంసాదులంతా చూచుచుండ శ్రీకృష్ణుడు చాణూరుడను మల్లుని జంపెను. అనంతరము శ్రీకృష్ణుడు మధురాధిపతియైన కంసుని వాని తండ్రిని గూడ జంపి రాజ్యమంతా యాదవరాజునకు వప్పగించెను. జరాసంధుడు మధురాపట్టణమును ముట్టడించి యుద్ధము చేయుచుండ బలరామకృష్ణులు మధురను విడచి గోమంతకమునకు వచ్చి జరాసంధుని యుద్ధములో జయించి ద్వారకాపట్టణమును నిర్మించి యందు యాదవులతో సహా హాయిగ నుండెను. అనంతరము శ్రీకృష్ణుడు భూమి సుతుడైన నరకాసురుని జంపి వానిచే గొనిరాబడిన దేవగంధర్వాదుల స్త్రీలను వివాహమాడెను. ఈ విధముగా శ్రీకృష్ణుడు పదహారువేల స్త్రీలతోను రుక్మిణీ సత్యభామాది యెనమండుగురు పట్టమహిషులతోను గూడుకొనినవాడై మణిశైలరత్న భూయిష్ఠమైన భూమిని పాలించుచూ ఇంద్రుని జయించి స్వర్గమందలి పారిజాతవృక్షమును దెచ్చి దానిని సత్యభామ యింట్లో పాతెను. అనంతరము శ్రీకృష్ణుడు సాందీపనునివలన శస్త్రాస్త్ర జ్ఞానమును సంపాదించెను. పంచజనుడను దైత్యుని జంపి యమునివే బూజింపబడెను. కాలయవనుడను రాక్షసుని జంపి ముచుకుందునిచే బూజింపబడెను. కురుపాండవులకు జరిగిన సమరములో పాండవుల పక్షము వహించి దుర్యోధనాదులను ఓడించి దేశములో ధర్మరాజ్యము నేర్పరచెను. కురుపాండవుల యుద్ధములో కృష్ణపరమాత్మ వహించిన పాత్ర అమితము, అప్రమేయము. ఉదాహరణకు, పాండవులు, అరణ్యవాసము, అజ్ఞాతవాసము పూర్తియైన పిదప తమ యర్ధరాజ్యమును గాని చివరకు అయిదు గ్రామములు గాని యివ్వవలయునని కోరుచూ దుర్యోధనుని వద్దకు శ్రీకృష్ణుని దూతగా బంపిరి. అంత శ్రీకృష్ణుడు సభదీర్చియున్న దుర్యోధనుని వద్దకు వెళ్లి సుయోధనా! పాండవుల యర్ధరాజ్యమును తిరిగి యిచ్చివేయుము, లేదా, దానికి బదులు కనీసము అయిదు గ్రామములైనా వారికి యిమ్ము, లేనియెడల యుద్ధము తప్ప వేరొకమార్గము లేదు అని చెప్పెను. అప్పుడు దుర్యోధనుడు సూదిమొన మోపినంత భూభాగమునుకూడ పాండవుల కివ్వనని చెప్పి శ్రీకృష్ణుని తాడుతో బంధింప ప్రయత్నించెను. అంత శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును ప్రదర్శించి విదురాదులచే బూజింపబడినవాడై తిరిగివచ్చి ధర్మరాజుతో యుద్ధముతప్ప వేరొక గతిలేదని చెప్పెను.

కురుక్షేత్రమునందు యుద్ధసన్నద్ధులైన కురు పాండవ సేనలు చేరినవి. అర్జునుడు రెండుసేనల మధ్య తన రథమును ఆపుమని శ్రీకృష్ణునితో జెప్పి భీష్మద్రోణాదులను మిగిలిన బంధువర్గమును జూచి రక్తపు కూడు నాకెందుకు నేను యుద్ధముచేయను అని మోహము చెందియుండ శ్రీకష్ణపరమాత్మ వానికి జ్ఞానము బోధించి యుద్ధమునకై సన్నద్ధుని గా జేసెను. శ్రీకృష్ణుడు అర్జునునకు రణక్షేత్రమైన కురుక్షేత్రములో చేసిన బోధలే నేడు భగవద్గీతలను పేరుతో ప్రసిద్ధిజెందియున్నవి. సమస్త ఉపనిషత్తుల సారభూతములే భగవద్గీతలు. శ్రీకృష్ణపరమాత్మ సహాయమువలన పాండవులకు యుద్ధములో విజయము గల్గెను. ఈ విధముగ విష్ణుభగవానుడు ధర్మరక్షణకొరకు, అధర్మ నాశనముకొరకు శ్రీకృష్ణావతారము నెత్తి కురుపాండవులను నిమిత్తముగా జేసుకొని భూభారమును తగ్గించెను. అనంతరము శ్రీకృష్ణుడు బ్రాహ్మణశాపమును మిషచే యాదవ కులమునంతను ముసలముచే నశింపజేసెను. తానుకూడ ప్రభాసక్షేత్రమున దేహమును విడచెను.



# స్వాగత గీతం

శ్రీమతి ఆలా సరోజినీదేవి

స్వాగతం! సుస్వాగతం!
సంక్రాంతికి స్వాగతం!!
అలరించెడి సంక్రాంతికి,
ఆంధ్రులిచ్చె స్వాగతం!!

ప్రకృతి రమణీయకతలు
ప్రసరించిన పల్లెసీమలు,
చేతులెత్తి స్వాగతాలు
చెప్పినవి సంక్రాంతికి!

కొంగ్రొత్త ధాన్యరాసులు
కొని తెచ్చిన సంక్రాంతికి
ఆంధ్రావని మనసారగ
నందించెను స్వాగతం!

శీతల పవనాలు వీయు,
జీవుల వణికింపజేయు,
సంక్రాంతికిభోగిమంట
సాగి, స్వాగత మిచ్చింది?

హరి దాసులు హరినామం,
పారాయణం జేయగా,
పరవశించిన సంక్రాంతి,
పరువులెత్తిందీ రోజు!

చిన్నారి గంగిరెద్దులు
సన్నాయి మేళాలతో,
స్వాగత గీతిబాడగా,
సాగిందీ సంక్రాంతీ!

యింటింటి ముంగిటముగ్గు,
యిల్లాలికున్న కొలసిగ్గు!
ప్రియతరమైన సంక్రాంతిని
ప్రేమలాలికించి పిలిచింది!

గొంతెత్తి కన్నెలందరు
సంబరాన, వేగిరాన,
గొబ్బిపాటలన్ని పాడిరి
సంక్రనందనుని రమ్మని!

మరదండ్ర పరిహాసములకు
మై మరచి పోవుబావలకు,
పుట్టిల్లైన సంక్రాంతి,
మెట్టగామా స్వాగతం!

స్వాగతం! సుస్వాగతం!
సంక్రాంతికి స్వాగతం!
అలరించెడి సంక్రాంతికి,
ఆంధ్రులిచ్చె స్వాగతం!!



# విచారం ఫిరాయింపు

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

ఆఫీసుకు పోదామని గడప దాటాను కూడా విడిగా - అప్పుడే పదకొండు గంటలయింది. వెడుతున్నారూ – ఆఫీసుకి అంటూ ముసిముసి నవ్వులతో ఎదురయ్యాడు ప్రక్కయింటి పద్మనాభాచార్యులు.

అసలే ఆఫీసులో మనసీటు వార్నింగులమయంగా వుంది. టుడే-టుడే అని పడివున్న కాగితాలు తెగ బెదిరిస్తూ కలలోకూడా కనిపిస్తున్నాయి. ఆ టుడేలు యింకా రావేం అని పెర్సనలు అసిస్టెంటు వేసే కేకలుకూడా చెవుల్లో గింగురుమంటూంటే నిద్దట్లో కూడా వులిక్కిపడుతున్నాను. ఫైలు కనిపిస్తే కాగితం దొరకదు. కాగితం కనిపిస్తే ఫైలు దొరకదు. రెండూ - భగీరథ తపస్సు చేశాక కరుణించి కనిపిస్తే - అయ్యగారు రమ్మంటున్నారు సార్ అని డఫేదారు పిలుపు. కొంప మునుగు పోయినట్టు గడియారం తెగతిరుగుతుంది. ఏ కాగితాలూ కదలకుండానే అయిదు-ఆరు-ఏడు-నిరుత్సాహంగా యింటికి రావడం, పరధ్యానంతో భోజనం, తామరాకుమీద నీటిబొట్టులాగ యింట్లో మనశ్శాంతి లేకుండా వుండడం, తెల్లారడం - తెల్లమొహంతో - గుమాస్తాననే బిక్కమొహంతో గంపెడు బెంగలతో మళ్లీ ఆఫీసుకు పోవడం-దిగాలుగా తిరిగి రావడం. నా సీటుని అద్దంలా చేసిపెట్టాలని ఎంతో తాపత్రయం వుంది. నిజం చెప్పాలంటే మంచి శకునం చూసుకుని ఆఫీసుకి వెళ్లానా - శకునబలమో - లేక అనుమానం లేని మానసికబలమో మరి - చకచకా చలాకీగా పని సాగిపోయేది. ఆవేళ హుషారుగా యింటికివచ్చి పిల్లలతో పార్కుకి షికారుకుకూడా పోయే అలవాటయింది. ఒకొక్కనాడు ఓ మహాతల్లి లేక మహానుభావుడు యిలా ఎదురయితే నా పాట్లు యీశ్వరుడికెరుక. కలం కదలదు. రిమైండర్లు రెడీ. స్లిప్పు – ఆ ఫైలు కావాలి – యీ ఫైలు కావాలి అంటూ - ఏం చెప్పను – ఆవేళ మతిలేని పనులు – మనమే చేశామా అనే పనులు తట్టెడుంటాయి – ఇహ - యింటికి ఎలా వస్తానో స్పృహే వుండదు.

ఒంటి బ్రాహ్మణుడు - వైష్ణవమూర్తి ఫిరంగి గుండు దెబ్బలాగ మనకే నూటి శకునం. గుండె దడదడ లాడింది. అప్రయత్నంగా యింట్లోకి వెళ్లాను.

పాపం మా అత్తగారు నా అవస్థ చూసింది. ఇంట్లోకి వెళ్లి మా శ్రీమతితో చెప్పింది. ఇంక మా ఆవిడ ఓ బాపతు నవ్వుముఖం పెట్టి - ఏం వచ్చారు - శకునం కుదరలేదా. అయినా రోజూ శకునం ఎందుకండీ–మీ పిచ్చ కాకపోతే - ఇంతకీ ఎవరెదురయ్యారేవిటి అంటూ యిన్ని ప్రశ్నలు వేసింది. అల్లుడుగారికి శకునాలంటే అంత నమ్మకమా ? అనుకుంది అప్పుడే మా అత్తగారు. వూరికే చెప్పారుటే పెద్దలు - పెద్దలమాటలు వేదాక్షరాలు. దైవబలం అంతా శకునరూపేణా ముందే తెలుస్తుంది అంది. పాపం ఆ పెద్ద ముత్తైదువ. ఆ తర్వాత ఎవరు నాయనా ఎదురయింది ? అని నన్ను చూసి అడిగింది.

'ఆఁ ఎవరూ కాదండీ మన ప్రక్కయింటి పద్మనాభాచార్యులుగారు. ఆయనే – ఎదురయ్యాడు, ఒంటిబ్రాహ్మణుడు ఎదురవకూడదూ కదండీ పంచాంగంలో వ్రాస్తారు' అని అన్నాను నేను.

ఔను నాయనా - ఒంటిబ్రాహ్మణుడు ఎదురయితే ఆవేళ పనికాదు. మీ మామగారూ యింతే. ప్రతి పనికీ పంచాంగం చూస్తారు. తిండిలో ఏవిటి - తిరగడంలో యేవిటి - ఆఖరికి యీ పంచాంగం పట్టింపులో యేవిటి అచ్చు మామగారి పోలికే నువ్వు అంటూ మా అత్తగారు నన్ను మెచ్చుకుంది.

అంత పెద్ద ఆమె అలా అంటూంటే - మా ఆవిడ చర్రున అందుకుంది, ఈ బస్తీలలో యీ తిథులు– వారాలు-నక్షత్రాలు–రాహుకాలం – నా మొహం కాలం చూసుకుంటుంటే ఎలాగ. కాలం కళ్లెంలేని గుర్రంలా పోతుంది. అప్పుడే ఆయన ఆఫీసుకు అరగంట లేటయింది. ఏం – పద్మనాభాచార్యులుకేం. సాక్షాత్తూ విష్ణుమూర్తిలాంటి మనిషి. ఆ పంగనామాలు, ఆ వేషం - అంతా విష్ణుమూర్తే. విష్ణుమూర్తి ఎదురయితే మంచిది కాదూ అంది మా శ్రీమతి.

ఇలా వితండవాదం వేస్తూంటే - మరి వాదించడం మంచిదికాదని చరచరా ఆఫీసుకు వచ్చాను. ఆఫీసు గడియారం అరగంట స్లోలో పోతూంది, ఆవేళ నా కోసమేమో మరి. గప్ చిప్ గా లేటు అటెండెన్సు పీడ తప్పించుకొని — ఒగర్చుకుంటూ సీటులో పడ్డాను. ఇది కావాలి — అది కావాలి అని అప్పుడే అర్జంటు పిలుపులు ఆరంభమయ్యాయి. ఎన్నాళ్లనుంచో అజా పజాలేని ఫైలు ఆవేళ పుటప్ చేయాలన్నారు - ఆఫీసరుగారు ఆవేళ నన్ను పిలిచి మరీ చెప్పారు. ఆ ఫైలున్ని సముద్రంలోపడి యీదుతున్నాను - పద్మనాభాచార్యులుని తలుచుకున్నాను. మహానుభావా! మీదవాలిన శకునమహిమ చెడ్డదనుకున్నాను. మీ దయవల్ల లేటు అటెండెన్సు గండం గడిచింది. ఇంక యీ ఫైలు కనిపిస్తే — తప్పకుండా పద్మనాభాచార్యులుగారి శకునం ఒంటిబ్రాహ్మడి శకునమైనా - మా ఆవిడ చెప్పినట్టు అది విష్ణుమూర్తి శకునంకింద జమకట్టుకుంటాను అనుకుంటూ ఫైలుకోసం వెతుకుతున్నాను. దీని తస్సాదియ్యా — ఆ ఫైలు అక్కడే కనిపించింది. పద్మనాభాచార్యులుగారి శకునం అమృతోపమానమైన శకునం అని ధీమాగా తెలుసుకున్నాను. ఇక్కడ చిన్న గమనిక వుంది. ఒంటిబ్రాహ్మడు ఎదురయితే నిక్కచ్చిగా చెరుపే. కాని ఒక్కొక్క ఒంటిబ్రాహ్మడు యీ రూలుని ఎదిరించి పుడతాడు. అప్పుడు శుభశకునం అవుతుంది. ఇదేవాదం యితర శకునాలలోకూడా యిలాగే ఫలిస్తుంది — అని అనుకుంటూండగానే —

ఏడవకయ్యా బాబూ — యిది ఆఫీసు — అరుగో మీ నాన్నగారు అంటూ జవాను జగ్గయ్య మా మూడోవాడు శివకుమార్ ని — సరాసరి నా సీటు ముందర నిలబెట్టాడు. జగ్గయ్య ఎంత తంటాలుపడినా మావాడు ఏడుపు మానితేగదా. ఏం — నాన్నా — ఏడుస్తూ వచ్చావేం — అన్నాను వాడి కన్నీళ్లు తుడుస్తూ. నన్ను చూసి శివకుమార్ యింకా యేడుపు ఆరంభించాడు. ఎందుకు నాన్నా - అలా ఏడుస్తావ్ అమ్మ కొట్టిందా - ఫరవాలేదులే - వూరుకో. నాన్నవు కదూ — వూరుకో అన్నాను. తల అటూ యిటూ తిప్పి యింకా ఏడుస్తున్నాడు. బాబువి కాదూ - డబ్బివ్వనా? అని జేబులు తడివాను ఎక్కడా నయాపైసాకూడా తగులడలేదు — ఎలా వుంటుంది ఆవేళ 20వ తేదీ అయితే. శివకుమార్, వీడి యిల్లు బంగారం గాను — ముఖారి రాగం బాగా పట్టుతున్నాడు. అది ఆఫీసాయె. పదిమందీ వచ్చే స్థలం. పని చురుకుగా సాగే సమయం. ఆఫీసరు హడావిడిచేసే సమయం. యిలాంటి సమయంలో శివకుమార్ మానకుండా ఏడుస్తున్నాడు. నా ప్రక్కనున్న గుమాస్తా తెచ్చుకున్న టిఫిన్ పొట్లం విప్పి — వాళ్లావిడి వేసిన నేతిగారెలు రెండుతీసి మావాడికిచ్చాడు. నిష్పుర్తుగా ఆ చిన్న వెధవ ఆ గారెలు రెండూ నిబ్బరంగా తిని మళ్లీ యేడుపు లంకించుకున్నాడు. వూరుకోరా! అంటే వూరుకోడు. ఇలా ఏడవడానికి కారణం ఎనలిటికలుగా యత్నించినా వచ్చినా చెప్పడు. ఓ మహానుభావా! పద్మనాభాచార్యులూ! వచ్చిపడిందయ్యా నీ శకునబలం! అనుకున్నాను. ఇహ వీడు యిలాగ ఏడుస్తూంటే యెలాగ. వారు వీరూ మూగడం - నాకు చిన్నతనం కావడం. నోరు మూస్తావా మూయవా అని కళ్లెఱ్ఱ చేశాను. మానితేగా, నాకళ్లు చల్లబడ్డాయిగాని చటుక్కున - వాడినోట ఆ ఏడుపుకి ఏమీ అంతులేదు. పాపం తోటిగుమాస్తాలు — పిల్లలున్నవాళ్లు — లేనివాళ్లూ - అదోబాపతు సానుభూతితో కుర్రాడు లెండి అని వాడిని బుజ్జగించడం ఆరంభించి - వూరుకో బాబూ అంటూ వాళ్లు విశ్వప్రయత్నం చేశారు — ఆ ఏడుపు మాన్పించడానికి. ఆ మంకుపట్టు మావాడు వదిలాడా! ఇది పనికాదని మావాడిని దంచితే బాగుంటుందని. ఏ బెత్తమయినా దొరుకుతుందేమోనని వెతుకుతున్నాను. ఎవరా ఏడుపు - ఏవిటీ గలాటా! యిది ఆఫీసా - కాదా! అని అరుచుకుంటూ పెద్ద పెద్ద అంగలువేస్తూ మా ఆఫీసరు యమధర్మరాజులాగ - గర్జిస్తూ గదిలోకి వచ్చిపడుతున్నాడు. ఏడవకురా బాబూ! అని నోరుమూశాను. నా చెయ్యి అలాగే వుందిగాని ఏడుపుస్థాయి తగ్గలేదు. ఇది కాదు సాధనం అని జేబురుమాలుతీసి వాడి నోటిలో కుక్కుతున్నాను - ఏడుపు తగ్గింది. క్షమించండి - వీడు మా మూడోవాడు. వీడిపేరు శివకుమార్. నా దగ్గర బాగా అలవాటు సార్. ఏ కడుపు నొప్పో వచ్చింది. యిలా ఏడుస్తున్నాడు. చిన్నపిల్లలు కదండీ, బాధ చటుక్కున చెప్పలేరు. అని నేను అంటూంటే మా ఆఫీసరు తీవ్రత తగ్గించుకొని, ఔనులెండి పసివాడు అంటూ మా శివకుమార్ ని చూచి - బుగ్గపట్టుకొని — ఎందుకబ్బాయ్ ఏడుస్తావ్ — అని లబ్జుగా అడిగాడు — కడుపునొప్పా అని ఆయన అంటే ఊహుఁ అని వీడన్నాడు. అన్నింటికీ పట్టి వుహూఁలే. మరెందుకురా నువ్వేడ్చేది - నిజం చెప్పు నీకు డబ్బిస్తాను అని మా ఆఫీసరు పర్సుతీసి అందు

లోంచి పది నయాపైసల బిళ్ల చూపించుతున్నాడు. దానిమీద దృష్టి లేకుండా మావాడు - మా తాతయ్య చచ్చిపోయాడుట - మా అమ్మా వాళ్లూ ఏడుస్తున్నారు. నాన్నతో చెప్పి రమ్మన్నారు. మా తాతయ్య పప్పులు, మిఠాయి తెచ్చేవాడు — తాతయ్య చచ్చిపోయాడుట అంటూ చెబుతున్నాడు, బిక్క మొహంతో —

అదే-రావుగారూ తాతయ్యచచ్చిపోయాడంటాడే. తాత అంటే ఎవరో అని మా ఆఫీసరు అడిగాడు. నేనేం చెప్పగలను సార్. వీడు యింత ఘాటువార్తని మీ సన్నిధానంలోనే వదిలాడు. కలికాలం కుర్రాళ్లు ఎంత బుర్రగలవాళ్లో చిన్నప్పటినుంచీ - అని నేనన్నాను. తాత అంటే మా నాన్న కావచ్చు. లేదా మా మామగారు కావచ్చు. ఇందులో ఎవరు చచ్చివుంటారో నేను ఎలాగ వూహించడం. పప్పులు — మిఠాయి - ఇద్దరు తాతలు తెచ్చేవారు. అందుచేత ఏ తాత చచ్చినా యీ కుర్రకుంకకి ఒకసోర్సు పోయినట్లే గదా.

విపత్కాలం నామీద వాలినట్లే గదా. నెలచివర రోజులలో యిలాంటివి సంభవిస్తే ఆ గుమాస్తా గుండె ఎలా కొట్టుకొంటుందో అనుభవించే వాళ్లకిగాని తెలియదు. ఎవరో ఒక తాతట! అది మా నాన్న కాకూడదు వెంకటేశ్వరస్వామీ అని ఏడుకొండలవాడికి దణ్ణం పెట్టుకున్నాను.

రాని ఏడుపు తెచ్చుకొని - కొంచం వుమ్మి కళ్లకు అంటించి భరింపలేని బాధతో బెంగని ఆ ముఖంలో చూపించేసరికి అందరూ నా దగ్గరకు వచ్చారు. ఆ ఆఫీసరు యింక ఫిలాసఫీలోకి దిగారు. ఇంతేనండి — తనువులు అశాశ్వతం, ఇంతకీ పోయినవారెవరని మీరు బాధపడుతూంటూ — అని అడిగాడు జాలిగా. బహుశా — మా మామగారే అయివుంటారు. ఇంట్లో మా అత్తగారు వున్నారు. అంతా ఏడుస్తూంటే విధాయకంగా మా మామగారే పోయివుండాలి. మా నాన్న దర్జాగా వున్నాడండీ, నిన్ననే ఆయనరాసిన వుత్తరం అందింది - అని నేను విచారం నిండిన మాటల్ని విడివిడిగా వదిలాను. మామగారు పోతే మాత్రం కష్టంకాదుటండీ — అందులోనూ అత్తగారు యిక్కడే వున్నారంటున్నారే. భార్య మరణ సమయంలో దగ్గఱ లేకపోతే ఆ జీవుడు ఎంత అశాంతిగా తనువు చాలించాడో! అని ఒకరన్నారు. పాపం రావుగారికి అనుకోని ఆపద దివ్వున వచ్చిందే.

లేచిన వేళావిశేషం - ఎవరిమొహం చూశానో లేస్తూనే - అని యింకోరన్నారు. ఎవళ్లకి తోచినట్లుగా వాళ్లు ఓదారుస్తున్నారు. బిక్క మొహంతో - బెంగతో నేను అలాగే నిలబడ్డాను.

ఇంకా ఎందుకు అలా బాధపడతారు. కర్తవ్యం ఆలోచించండి. పదిరోజులు శెలవుపెట్టండి. అర్జంటు కాగితాలు మీ పక్క గుమాస్తాగారికి అప్పచెప్పండి- అని ఆఫీసరు కొంచెం ధైర్యం చెప్పారు. పక్కకి పిలిచి - డబ్బు ఏమయినా కావాలా? అని జాలిగా అడుగుతూ ఎందుకయినా మంచిది యీ యాభై రూపాయలూ దగ్గఱ వుంచుకోమన్నారు. కష్టకాలంలో యిలాగ ఆదరించే వాళ్లుంటే యింకేం కావాలి. కష్టం కష్టంగానే కనిపించదు.

మా ఆఫీసరు చూపిన దయను తలుచుకుంటూ - శివకుమార్‌తో మెల్లిగా యింటికి చేరుకున్నాను. ఏం చెప్పను యింటివరస. మా అత్తగారు హెచ్చుస్థాయిలో ఏడుస్తూంది. ఆవిడకి పక్కపాట పాడుతూంది తక్కువస్థాయిలో మా ఆవిడ. పిల్లలంతా బిక్కమొహాలతో వచ్చీరానట్లుగా ఏడుస్తున్నారు. ఇరుగూపొరుగూ పోగయ్యారు, ఎవరు పోయిందీ తెలియక తికమక పడుతున్నాను. ఏవిటిదంతా? అన్నాను మా ఆవిడతో. ఇంకా ఏవిటిదంతా? అంటున్నాడే! అని చప్పట్లు కొడుతూ — గుండె బాదుకుంటూ - నెత్తి పీకుకుంటూ - దేవుడా - దేవుడా - అని గోల పెడుతూంది మా అత్తగారు. మా నాన్నకి నూరేళ్లు అనుకున్నా! మా మామగారైనా అంత చప్పున పోవలసిన మనిషి కాడే. ఇంతలో మా ఆవిడ వచ్చింది. మా నాన్న వెళ్లిపోయాడండీ అని బేరుమంది. కన్నతండ్రి పోతే కాపరానికి వెళ్లిన ఆడబిడ్డలు ఎంత బాధపడతారో అనుకున్నాను. మీ కింతకీ యీ కబురెలా తెలిసింది? అన్నాను మా ఆవిడతో. ఎలా తెలియడం యేవిటి, కుమార్ చెప్పలేదూ అంది దగ్గుత్తికతో. అబ్బే! వాడువచ్చి వత్తి యేడుపు మినహాయిస్తే మాటా — మంతా! ఆఫీసు టుపాకం లేచిపోయేటంత ఏడుపు. ఫలానా వారు పోయారని చెబితేగా — పప్పులు - మిఠాయి తెచ్చే తాతయ్య చచ్చిపోయాడన్నాడు గంటసేపు యేడుపు అయ్యాక. ఆమాట రావడమే అంత యజ్ఞం అయింది. ఇంతకీ యెలా తెలిసింది — అని రెట్టించాను. పోస్టుకార్డు వచ్చిందండీ - యిప్పటిదాకా యిక్కడే వుండాలి - అంటూ వుత్తరంకోసం వెతి

కింది మా శ్రీమతి. ఈ కుర్రకుంకలు వున్నవి వున్న చోట వుంచరుకదా. అన్నీ వీళ్లకే కావాలి. అంతకీ మా ఆవిడ మర్దనం - గుణవర్ధనం అని దంచుతూనే వుంటుంది. కొడితే వీపు అప్పచెప్పతారే కాని కోణంగితనమూ — కోంటెవేషాలు మాత్రం మానటం లేదు. ఆ విచారంతో అంతకీ వెతికింది. కనిపిస్తేనా ఆ వుత్తరం. కనిపించని వుత్తరంకోసం వాళ్ల అమ్మ అలా కంగారు పడుతూంటే — కుర్రకుంకలు సునిశితంగాచూసి కనిపెట్టారు. ఈ నేరం ఎవళ్లమీద పడుతుందో ఎవళ్ళకి చీవాట్లూ - చెప్పదెబ్బలూ రాశాయో యిప్పుడనుకుంటూ పిల్లిపిల్లలలాగ మెల్లిగా జారిపోయారు అటూ - యిటూ. అన్నీ చూస్తున్నా, యిలాంటిగి యీ యింట్లో కొత్త కనకనా.. సరేలే - ఏం అవస్థపడతావ్. ఇంతకీ జబ్బేం చేసిందో పాపం మావగారికి అన్నాను. మా ఆవిడ బిక్కమొహంతో — అవేమీ లేవు. ఆ వుత్తరంలో మొన్నరాత్రి పోయారని వుంది — అంతే అంటె మా ఆవిడ. అంతేలే. మనిషిపోయాక — మరి జబ్బుగొడవలు పర్శించి లాభం యేవిటి? ఇంతకీ ఎవరు వ్రాశారో ఆ వుత్తరం - అని మళ్లీ ప్రశ్నించాను శ్రీమతిని. ఆవిడ విచారాన్ని గుటకలువేస్తూ - మీ చాదస్తంకాని ఎవరో ఒకరు గీకి పారేస్తారు ఆ సమయానికి. వాళ్లేరాయాలి - వీళ్లే రాయాలనే నిషా వుంది కనకనా, వెళ్లిపోయాడు. ఇంత పెందరాళే వెళ్లిపోతాడనుకోలేదు. వచ్చి యిక్కడ రెండునెలలయినా వుంటానన్నాడు మొన్న మావూరు వెళ్లినప్పుడు. దిక్కుమాలిన చావు, యెంత ముంచేసిందో చూడండి. ఆఖరికి కట్టుకున్న పెళ్లాంకూడా దగ్గర లేకపోయింది కదా - తలుచుకుంటే గుండె తరుక్కుపోతూందండీ. నాన్నా - మమ్మల్నందరినీ వదిలి వెళ్లిపోయావా - అయ్యయ్యో అంటూ పెద్దపెట్టున ఏడుపు ఆరంభించింది మా ఆవిడ. ఆవిడతోపాటు అత్తగారు. ఇంతమందీ యేడుస్తూవుంటే, మామగారూ! ఎంత మంచివారండీ - అప్పుడే నూరేళ్లూ నిండాయా మీకు అనుకుంటూండగానే నాకూ ఏడుపు వచ్చింది. ఆసెమ్మా - బోసెమ్మా వచ్చారు కదూ. ఏవిటి మీ చాదస్తం - మగవాళ్లు ధైర్యం తెచ్చుకోవాలి - ఆడాళ్లకి ధైర్యం చెప్పాలి. చచ్చినవాళ్లతో సమంగా చావగలమా. ఆయనకేం మగ్గినపండు. చాలా అదృష్టవంతుడు. కొడుకులూ - కోడళ్లూ — అల్లుళ్లూ - కూతుళ్లూ అందరూ హాయిగా వుండగా - చీకూ చింతా లేకుండా వెళ్లిపోయాడు అంటూ వుపన్యాసం యిస్తున్నారు. పరామర్శ మాటలు - కేవలం పడికట్టు రాళ్లు, అవి అందరికీ చేతకావు.

ఇంక యిలావుంటే యెలాగ, ఏం చేయాలో ఆలోచించాలని మా ఆవిడని పిలిచి మళ్లీ అడిగాను. కొంచెం యెక్కువగా వుండగానే ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం యివ్వకూడదా చెప్పు, చూపు లేనా దక్కేవి. పోయాక - యీ వుత్తరం వ్రాశారు. ఎంత తెలివిగలవాళ్లు. ఈపాటికి అప్పుడే దహన సంస్కారాలుకూడా అయే వుంటాయి. పాపం - అత్తగారికి ఏమి చెప్పాలనుకుంటూ పోయారో! అని అంటూ మా ఆవిడకి కొంచం ధైర్యంచెప్పి - అత్తగారిని ఓదార్చి - ఇంక మూడున్నర గంటల బండికి పోవాలి — అన్నీ సిద్ధం చెయ్యండి - నేను వెళ్లి రెండు జట్కాలు తెస్తాను స్టేషనుకి - అన్నాను. మా ఆవిడ ప్రక్కకు పిలిచి డబ్బు యెక్కడైనా చూశారా — అందరం కదిలి వెళ్లడం మాటలా! అంది. మా ఆఫీసరుగారు - ఎంతో జాలిచూపిస్తూ పదిరోజులు క్యాజువల్ లీవుతోసహా వడ్డీలేని చేబదులుగా యిచ్చిన యాభై రూపాయల మాటా చెప్పేసరికి - చూశారా - యిదంతా మా నాన్న మహిమ కాదంటారా? అంది. ఎలాగనుకొన్నా మంచిదేలే అనిచెప్పి నేను చరచరా జట్కాలకోసం బయలుదేరాను. అప్పుడే అప్పటికి చూస్తుండగా రెండు దాటింది. అర్జంటుగా జట్కాలుతెచ్చి యింటిముందు వుంచాను. మా ప్రక్కవాటాలో వున్నవారూ లేరు. వాళ్ల ఆవిడ పుట్టింటికి పురిటికి పోయింది. ఆయన హైస్కూలు మేష్టరు. ఇంట్లో ఆడాళ్లుంటే మధ్యాహ్నం కాఫీకి వచ్చేవాడు. సత్రం భోజనం మఠం నిద్రలాగ — హోటలు భోజనం - ఒంటరి మకాంలాగ వుంది ఆయన పని. కాని చాలా వుత్తముడు. ఆయన లేనందుకు చాలా విచారించి దాసీదానితో చెప్పమన్నాను — ఆయనకీ సమాచారమంతా. అన్నీ సర్దుకొని తాళాలు బిగించి - ముఖారి రాగాలు నిండిన ముఖాలతో అందరం జట్కాలు యెక్కాం. జట్కాలు చకచకా పోతున్నాయి. నాకుమాత్రం బావమరది మీద మహాచెడ్డకోపం వచ్చింది. మనిషిని చూసుకోలేని పరిస్థితిలో పెట్టేడే - అని. ఏం చేస్తాం! అనుకున్నాం. అసలే తండ్రి పోయిన కష్టం గదా! అందులోనూ మనం యీ దులిపి పారేయడం ఏం నీతి! అనుకున్నాను. ఇంతలోనే రైలుస్టేషను వచ్చింది. దిగాం. పోయి టిక్కెట్టుకొని — సామానుతో - పిల్లలతో — జల్ల

ప్లాటుఫారం మీదకు వచ్చాం. జనంతో కిటకిటలాడుతున్నారు. పాపం - మా అత్తగారికి ఆ స్టేషను చూచేసరికి మా మావగారు జ్ఞాపకానికి వచ్చారు. మొన్ననే కదూ ఆయనే స్వయంగా వచ్చి మా అత్తగారిని యిక్కడ దిగబెట్టి వెడతా. ఇంతలోనే ఎంత లోపం ఎదురయిందిరా దేవుడా — ఎలాగ యీ బెంగని దిగమింగడం అని ఆవిడ చాలా విచారించడం - తల్లిని పట్టుకొని బిక్కమొహంతో మా ఆవిడ యింకా కుంగిపోవడం - వీళ్లిద్దరినీ చూసి నేను నిలువునా నీరయిపోవడం — ఇదంతా పద్మనాభాచార్యులు శకునమహిమ కాకపోతే మరేమిటి అనుకున్నాను. ఇతర ప్రయాణీకులు మమ్మల్ని చూసి చిన్న చిన్న పొడిప్రశ్నలు వాళ్లే వేసుకొని వాళ్ల ప్రశ్నలకి వాళ్లే సమాధానం చెప్పుకుంటున్నారు. రైలు గంట లేటు అన్నారు. చూశారా! ఒక అపశకునం తెన్ను చూసుకొని మానవుడిమీద వాలిందంటే — యిక లెక్కలేనన్ని అపశకునాలు. ఈ రైలు యివాళే లేటు కావాలా. ఇది యీ రాజమండ్రీలోనే గంటలేటుగా వస్తే - ఆ నిడదవోలు బండి యింకేం వుంటుంది. అది ముందే వుడాయిస్తుంది. హరహరా అంటూ ఆ నిడదవోలులో జాగరణ చేయాలేమో - పోనీ యింటికి పోదామా అంటే తీరా టిక్కట్లు కొన్నాను. కొన్నటిక్కట్లు స్టేషనులో యిచ్చి — ఏ అణాయో టిక్కట్టుకు తీసుకొని మళ్లీ మనడబ్బు మనకిస్తారు. ఈమాట మా ఆవిడ చెవిలో పడేసేసరికి — భగ్గున మండిపోయింది. ప్రాణాలే పోయాయి. వెధవడబ్బు మనల్ని రక్షిస్తుందా - ఎప్పుడూ యిలా అవస్థ పడతామా — ఆ జీవికోసం కొంచం ఓపికపట్టలేరూ - ఏమిటండీ! మీరూ మీ కంగారూ అని ఆవిడ విసిరి పారేసింది చిటపటల్లాంటి సిసింద్రీలని. ఆ ధాటీకి ఆగలేక ఎంత లేటయినా యీ ప్రయాణం నిబద్ధి అని తీర్మానించుకొని మళ్లీ వాకబుచేశాను గంటదాటిన పిదప - బండి వస్తుందా అని. అయ్యో సారీ-సార్- యీ టేక్ అప్ — యిజ్ డెఫినెట్లీ లేటు అన్నాడా స్టేషను మేష్టరు. ఆ మాటల్ని విని అలా కూలిపోయాను. ఇలా నిరుత్సాహంగా నేనుంటే అక్కడే వున్న కొంతమంది స్నేహితులు యీ విషయం తెలియక - నా దగ్గరకు రావడం ఏదో కులాసాకబుర్లు చెప్పడం. నా ముఖకళ వట్టిబెంగతో వుండడం వాళ్లు గ్రహించడం - అలా వున్నారేం అని వాళ్లు అడగడం - మా మావగారు పోయారండి - సకుటుంబంగా పోతున్నాను అని చెప్పడం జరిగింది. పదేళ్లుగా రాజమండ్రీలో పాతుకొని వున్నానేమో. వుద్యోగరీత్యా స్నేహితులు కొందరు, అసలు మన విద్యార్థి దశ వీరేశలింగం హైస్కూలు — ఆర్ట్సు కాలేజీలోనే గదా సాగింది. అరీత్యా కొందరు, చుట్టాలు కొందరు, చుట్టాల చుట్టాలు కొందరు, దూరపు చుట్టాలు కొందరు—ఇలాగ పరిచయం చాలా బాగా పాకింది. ఆ పరిచయస్థులు చాలామంది నాకు వచ్చిన యీ కష్టాన్ని ఆనోటా యీనోటా వినడం - బండి బ్రహ్మాండంగా లేటుకావడం — నన్ను క్యూ సిస్టములో పరామర్శించడం. కష్టం ఒంటరిగా బాధించదుకాని - కష్టాన్ని ఒకళ్లు అరటిపండు వొలిచినట్లు విడదీసి విమర్శించి పరామర్శిస్తూంటే - అది భరింపలేని బాధగా వుంటుంది. ఆ స్టేషను ప్లేటుఫారంమీద యిలాంటి అవస్థలో పడివున్నాం. రైలు జాడలేదు. జనం నిరుత్సాహంగా జారుతున్నారు. కాఫీలకని కొందరు, కాలక్షేపానికని కొందరు. నాకుమాత్రం కదలాలనే లేదు. కాఫీమాట తలపెడితే మా ఆవిడ ఏం కంగుమంటుందోనని ఆ మాటనే ఎత్తక రైలు చప్పునవస్తే బాగుండునని రైలు తపస్సు చేస్తున్నాను.

పాపం - మా ప్రక్కవాటా మేష్టారు దాసీదాని మూలంగా యీ మాట విన్నాడుకాబోలు. చాలా వుత్తముడు. అలాంటివాడు నా ప్రక్కవాటాలో వున్నందుకు నేను ఎంతో సంబరపడతాను. ఉంటారు - మరికొంతమంది పెటేపకాయి పొరుగువాళ్లు - అస్తమానం గొడవ. అన్నింటికీ రభస. మంచీ లేదు మర్యాదలేదు. వచ్చి - జేబులోంచి తీస్తున్నాడు యేదో. మళ్లీ మానేశాడు. రావుగారూ — చాలా కష్టం వచ్చిందండీ - యిప్పుడే మన అప్పలమ్మ చెబితే విన్నాను. అయ్యో! అని విచారాన్ని ప్రకటించాడు. మా వాళ్లని - అత్తగారిని సమీపించి వాళ్లనికూడా ఓదార్చాడు. దిక్కుమాలిన రైలు యివాళే యింత లేటు కావాలా చెప్పండి అన్నాడు. మళ్లీ చేతిని జేబులోకి పోనిచ్చి - అయిదు పదిరూపాయల నోట్లు తెచ్చి నాకిచ్చాడు. అబ్బే — వద్దండీ - వుంది నా దగ్గిర అన్నాను. నామాట వినండి — కష్టకాలం ఏదయినా అవసరం వుంటుంది. మీకు తెలియదు తీరికగా మనం మనం చూసుకుందాం అంటూ — ఎంత ఆదరణ! ఎంత లాలన!

కాస్సేపు యిద్దరం రైళ్లు లేటుగా రావడం గురించీ - తర్వాత యాక్సిడెంట్లని గురించీ - ప్రయాణీకుల రద్దీనిగురించి - రైళ్లలో దొంగతనాలని గురించి

ముఖ్యంగా మా ప్రయాణంపడే యిబ్బందిని గురించీ మాట్లాడుకున్నాం. ఇల్లు భద్రంగా చూడండి అని నేను చెప్పాను. సరేనండి ఆయన అంటూ వదలలేక వదలలేక ఆయన వెళ్ళిపోయాడు.

వెళ్ళినవాడు మళ్ళీ గుండెలు గొట్టుకుంటూ వచ్చాడు. చూశారా - నా మందమతితనం - మీకు వచ్చిన వుత్తరం పోస్టుజవాను మా యింట్లో పడేశాడండీ అంటూ ఒక కవరు వుత్తరం నా చేతిలో పెట్టాడు. ఆ వుత్తరం చేతిలో పెడుతూ - ముందే యీ వుత్తరం యివ్వాల్సింది - యీ తొందరలో తోచలేదు రావుగారూ అని మాట్లాడుతున్నాడాయన. ఫరవాలేదులెండి అని నేను అంటూంటే మా శ్రీమతి వచ్చింది — రైలు యింకా రాదా అంటూ. ఏమో! అంటూ కవరు చించుతున్నాను నేను. సమయానికి కనిపించదు. మీరందాకా అంతగా అడిగారా — ఆ కార్డు ఏది - ఏది అని. నా మందమతితనం మండిపోనూ — ఇదిగో నా కొంగుని ముడేసివుంచా అని చెప్తూ ఆ కార్డు యిచ్చింది ఆవిడ.

ఆ కవరు చింపి ఆ ఉత్తరం చూశాను. ఆవిడ యిచ్చిన ఆ కార్డు చూశాను. ఇప్పటివరకూ ఆ కార్డు చూపించనందుకు మా ఆవిడమీద ఎంతయినా కోపం వచ్చింది.

ఈ కార్డేనా నువ్వు చదివింది అన్నాను. ఔనంది - ఆవిడ. మీ నాన్నకి నూరేళ్ళు - అని నేనంటూంటే — మేష్టారు ఆ కార్డువైపు చూస్తున్నాడు. స్పష్టంగా ఆయన యడ్రస్సుంది ఆ కార్డుమీద. ఏమిటి రావుగారూ — ఆ కార్డుమీద నా యడ్రస్సు వుందంటూరా? అన్నాడాయన.

మా ఆవిడ ముఖం వెలవెలపోతూంది.

ఆ కార్డును మేష్టారికిచ్చాను. కవరు మా ఆవిడ చేతిలో పెట్టాను. నాలిక కరుచుకొని నవ్వేసింది. చరచరా వాళ్ళ అమ్మ దగ్గరకు పోయింది. కవరు వుత్తరం సారాంశాన్ని చెప్పింది. ఎక్కడలేని ఆనందం ఆ ముత్తైదువ ముఖంలో తాండవించింది.

కార్డును చదువుతున్న మేష్టారు - నిలువునా! కూలిపోయాడు. దిగాలుపడుతున్న ఆయనకు ధైర్యం చెప్పాను. రావుగారూ - పోయింది మీ మామగారు కాదండీ — మా మామగారు. ఈ వుత్తరం మా బావ వ్రాశాడు. మీకెలా వచ్చిందో యిది అనుకుంటున్నాడాయన.

ఎలారావడం యేమిటిలెండి! మన బీటుకివచ్చిన పోస్టుమేను పాకొత్తవాడు. ఒకరికిచ్చే వుత్తరం యింకొకరికిచ్చాడు. ఇంతకీ యడ్రసు మానుకోకుండా యింటర్మీడియటు ప్యాసయిన మా యిల్లాలు యింతగా పెద్దమనుష్యుల్ని ఏడిపించింది - ఏమనాలి చెప్పండి.

ఎందుకయినా మంచిది - నా మాట వినండి — యీ యాభై రూపాయలు మీ దగ్గర వుంచండి అని మేష్టారి చేతిలో యాభై రూపాయలూ వుంచాను. ఇదే రైలుకి నేనూ వస్తాను. యింకా లేటుట. యింటికిపోయి వస్తానని విచారంగా వెళ్ళిపోయారు. పోతూపోతూ — కనిపించిన వాళ్ళందరికీ రావుగార్ని మావగారు పోలేదు — పోయింది మా మావగారే అంటూ తన కష్టాన్ని చెప్పుకుంటున్నాడు.

ఇహ మా అత్తగారు - మా మావగారు వ్రాసిన ఆ వుత్తరాన్ని వందసార్లు చదువుకుంది. ఇదంతా కలగా వుంది నాయనా అంది. మీ అమ్మాయి తెలివి యిలా తెల్లారిందన్నాను. పోస్టువాళ్ళు యింతమోసం చేస్తారని ఎవరు కలగన్నారు అని మా ఆవిడ యీ తుట్టని ఆ పోస్టుమేనుమీద వేసింది.

పిడుగులాగ మా ఆఫీసరు — హెడుగుమాస్తా షికారుగా స్టేషనుకు వచ్చారు. ఏమయ్యా రావూ! క్యాజువల్ లీవుకి బలే స్టంటుకొట్టావే. ఇంతకీ మీ వాళ్ళెవరూ పోలేదట, పైగా మీ బావమరిది కొడుక్కి బారసాలట. బారసాలకోసం — శలవూ; డబ్బూ సంపాయించావే — అని ఫిరాయింపు విచారం విని ఫక్కున నవ్వుతూ — ఈ బారసాలకి నువ్వుపోయి యేంచేస్తావ్ - శలవు కేన్సిలు చేసుకుని ఆఫీసుకురా! అన్నాడు. ఇంతలో రైలు కూతకూస్తూ ఎదురుగా వచ్చి ఆగింది. మా ఆవిడ చొరవగా పిల్లలతో - సామానుతో - ఆనందంగావున్న అత్తగారితో రైలెక్కింది. మీరూ రండి - యింకా అలా నుంచుంటారే? అంది - ఆవిడకేం తెలుసు ఆఫీసర్ల ఆగ్రహానుగ్రహాల ఫలాలు. సరేలే — వెళ్ళిరా - చప్పున - శలవు పొడిగించక అని వీపుమీద తరచి వీడ్కోలిచ్చారు మా ఆఫీసరుగారు.

అష్టకష్టాలూ పడి ఆ మర్నాడు వూరు చేరుకున్నాం. తోరణాలు కట్టారు. సన్నాయి సాగుతూంది. మంత్రాలు చదువుతున్నారు. బారసాల పీటలమీద కొడుకూ — కోడలు కూర్చుంటే మా

మావగారు ఆనందిస్తున్నారు. నీ పేరే పెడుతున్నాను నాన్నా అని కొడుకు చెబుతున్నాడు — శుభం అని మా మావగారు వీధివైపు చూస్తున్నారు - మేమింకా రాలేదేం! అని. జట్కాలోంచి మేం దిగగానే — మా మరదలు గంతులేస్తూ — అదిగో అక్క! అడుగో బావ! యిదుగో అక్కయ్యగారి పిల్లలు అంటుంది.

ఆహా! వచ్చారా! అని మా మావగారు ముసి ముసి నవ్వులతో మురిసిపోయారు. అంతట్లోనే మా అత్తగారు - మావగారి కాళ్లకి కన్నీళ్లతో కడిగి దణ్ణం పెట్టారు. ఇదేవిటే యిలా యిడవుతావు అంటూ మావగారు తెల్లబోయారు.

అంతా శుభాంతం కాగా — భోజనాలయాయి. తాంబూలాలు సేవిస్తూ - ఉత్తరాలత్తర - విచారం ఫిరాయింపు ఎంతలో ఎంత జరిగిందో వినండి అంటూ జరిగినదంతా మావగారికి మనవిచేశాను. కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతున్నారందరూ. ఎందుకో మరి! మా శ్రీమతి ముఖం చిన్నబోయింది.



# స్వీకారము

గీతాధ్యానము ; శ్రీ స్వామి చిన్మయానంద, అనువాదం - శ్రీ ఉ. రాధా కృష్ణయ్య. ప్రచురణకర్తలు - చిన్మయామిషన్, పాకాల, చిత్తూరు జిల్లా.

పూజ్యపాద శ్రీ చిన్మయానంద స్వాములవారి ఉపన్యాసములకనువాదము. ఉపనిషదులులాంటి గ్రంథములకు శ్రీ స్వాములవారి వ్యాఖ్యానము కడుసులభమై సామాన్యప్రజలు సయితము గ్రహించుటకనువైనదిగానుండును. కాబట్టియే వారి ఉపన్యాసములు వేలకొలది ప్రజలను ఆకర్షించుచుండును. ఇట్టిదే యీ చిన్న పుస్తకము సయితము. ఇందులో భగవద్గీత ప్రాశస్త్యమును వివరించుటతోబాటు దానినిపఠించి, అనుష్టానమునందుంచుకొను మార్గములు వివరించబడినవి. ప్రతిహిందువునకు భగవద్గీత పవిత్రగ్రంథమై తన్ను తాను తీర్చిదిద్దుకొనుట కుపయోగపడునదగుటచే యీ చిన్నపుస్తకము గీతాపారాయణ, అనుష్టానములపట్ల ఆసక్తిని పెంపుచేయును.

కవిత్రయ కవితారీతులు - తరువాతి కవులపై వారి ప్రభావము : శ్రీమతి దేశిరాజు భారతీదేవి, బాపట్ల. వెల రు 2-50.

ఇది తెలుగు భాషాసమితివారి రు. 500/-లు బహుమతి బడసినగ్రంథము. ఈ గ్రంథరచనా సందర్భమున రచయిత్రి అమూల్యమైన పరిశోధనా పూర్వకమైన కృషి చేసియున్నారు.

కవిత్రయమువారైన నన్నయ, తిక్కన, ఎర్రనల కవితారీతులను ఉదాహరణలతో వివరించుచు దరిమిలాకవులపై వారి ప్రభావముండినది నిరూపించుట సామాన్యమైనపని కాకపోయినా రచయిత్రి సాహసించి చేసినకృషి అభినందించతగినది.

భారత కవితాపరిశోధనము, ఆకవి తాపత్రభావము దరిమిలా కవులపై, వారి రచనలపై నెట్లు ప్రతిఫలించినది నిరూపించ ప్రయత్నించిన నీగ్రంథము తెలుగు సారస్వత సంపదకు అమూల్యపుష్పము.

ఆంధ్ర మహావిష్ణువు : శ్రీ వజ్ఝల కాళిదాసు, ప్రవాసి ప్రచురణలు - ఆంధ్ర విజ్ఞాన సమితి, విద్ద్నివాస్ 'ఎమ్' రోడ్డు, బిష్టుపూర్, జంషెడ్‌పూర్. వెల75 న. పై.

ఆంధ్రజాతి మూలపురుషుని గాథ. ఇంతకేముందు యిది ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచికలో ప్రచురించబడినదైనా మృదుమధురమైన సరళిలో రసవంతంగా నడచిన కావ్యమిది. ఆంధ్ర మూలపురుషుని గురించి, ఆయన వీరోచితంగా సాధించిన విజయాలను గురించి వివరించిన యీ కావ్యము ప్రతియొక్క ఆంధ్రుడు చదువవలసినది.

# మీ ఉత్తరాలు పెందరాళే బట్వాడా చేస్తాము

సూర్యనారాయణగారు,
ధీ నగర్,
విజయవాడ 2*

## చిరునామాతో
# జోన్ నెంబరు
## వ్రాయండి

పెద్దపెద్ద నగరాలు అనేక తపాలా బట్వాడా జోనులుగా విభజింపబడ్డాయి.

జోన్ నెంబర్లనుబట్టి సార్టింగు వికేంద్రీకరింపబడి, మీ ఉత్తరాల బట్వాడా త్వరగా జరుగుతుంది.

జోన్ నెంబరు పైన వ్రాసి వున్న తపాలు తిన్నగా ఆ బట్వాడాజోనుకే పంపబడుతాయి.

జోన్ నెంబరు వ్రాసిలేని తపాలుకు సార్టింగు నిమిత్తం వ్యవధి పడుతుంది కనుక బట్వాడా ఆలస్యం కావచ్చును. మీ వూళ్ళో తపాలు బట్వాడాకు జోనులు ఏర్పడివుంటే, మీకు జాబులు వ్రాసేవారికి మీ చిరునామాతోబాటు ఆ జోన్ నెంబరుకూడా వ్రాయమని తెలియజేయండి.



## మీ సౌకర్యంకోసం మాతో సహకరించండి

తంతి, తపాలా శాఖ

DA 59/348

(5 వ-పేజీ తరువాయి)
చందమామ నిస్తూవున్నాడు. ఆ కాంతిలో భూమండలపు ఎగుడుదిగుళ్లనే తాత్కాలికంగా మనోమండలంనుంచి మరచిపోవచ్చు....

అబ్బాయికూడా ఈ మధురానుభూతులను అనుభవిస్తూ వున్నాడని చెప్పటం అనవసరం కదూ - ఆ ఆనందంలో వాడి చిరునవ్వుని చూసే తీరాలి. పెదవులని కదులుస్తూవున్నాడు. తన ఆనందాభిభూతులని నాకు తన ధోరణిలో చెప్పాలని వుబలాటపడుతూ వున్నాడు కాబోలు! అబ్బాయి అమాయకుడు. చిన్న చిన్న విషయాలతోనే తృప్తిపడటం వాడి జాతికి సహజమై వుండాలి...వాడికి పువ్వు అంటే ఎంత ప్రాణం! నేనేగా రోజా పువ్వు బొమ్మను రాసి వాడికి ఇచ్చింది! దానిని పుచ్చుకుని తదేకదృష్టితో చూస్తూ, ఎంత మురిసిపోయాడు! దీపం జ్యోతికి మల్లె ఎంత దేదీప్యంగా మెరిసిపోతున్నది, వాడు తన ఆనందాన్ని తెలుపుతూవున్న సమయంలో! ...ఇప్పుడు, ఇలా వాడు గాఢనిద్రలో వుండిపోయినా, ఆ ముఖ కవళికలు, అప్పుడు చూసిన జ్యోతులకన్నా రెట్టింపుగా ప్రకటిస్తూనే వున్నాయి. ఏకాకిగా ఎడారిలో వుండిపోవాలసి వచ్చింది. చెడిపోయిన నా యంత్రాన్ని చక్కజేసుకోటానికి సతమతమై పోతున్నాను, అలాటి సమయంలో మరో ప్రపంచంనుంచి అబ్బాయి నా ముందర వూడిపడటం, తన ముద్దు మాటలతో తను అక్కడికి వచ్చేటంత వరకు ఎదుర్కోవాలసి వచ్చిన సంఘటనలని నాకు చెబుతూ నన్ను సంతోషపెట్టడం!... ఆ దృశ్యాన్ని, మరచిఎలా పోతాను, ఇంత అర్ధరాత్రిలోఇలా వాడిని ఎత్తుకొని ముందుకు నడుస్తూవున్నా? పైన వెలుగు! నా చేతిలో వెలుగు!

గాలి వీస్తున్నది! సామాన్యమైనగాలి అయితేగా-దోవలో నన్నిప్పుడు సతమతం చేస్తూవున్న ఈ గాలి! ఎడారిగాలి అంటే ఇదే కాబోలు! ఇంతగాలి వీస్తున్నా పై వెలుగులో ఏ మార్పు కనబడటంలేదు. దానినిచూస్తూ నా చేతిలోవున్న వెలుగును ఈ ఈదురుగాలినుంచి కాపాడుకోటానికి శాయశక్తులా ప్రయత్నం చేయటం అవసరం! ..

ఇలా నడిచాను, నడిచాను. అబ్బాయిని ఈ అవాంతరాలనుంచి రక్షించుకుంటూ ఎంతదూరం ఇలా నడిచానో ఎవళ్లకి తెలును...సూర్యోదయమైంది. అదేం అద్భుతమో, నిన్నటి మధ్యాహ్నంనుంచి వెదుకుతూవున్న నుయ్యి దగ్గరికి తెల్లవారేటప్పటకి చేరుకున్నాను. ..

(ఇకముందు కథ ఎలా నడుస్తుందో వచ్చే సంచికలో చదువుదాం.)

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)

## మధ్వాచార్యులు

శ్రీ మధ్వాచార్యులు 1295 సం॥రమున - మంగళూరు మండలములోని ఉడిపికి కొలఁది మైళ్ళలోనుండు 'వేలాలి'- అను గ్రామమున నుదయించెను. అతని తండ్రి నారాయణ భట్టారకుఁడు; తల్లి వేదవల్లి. అతని జన్మదినమునిగూర్చి రెండభిప్రాయభేదములు గలవు. అందొకండు,- అతఁడు మాఘశుద్ధ సప్తమి నాఁడు పుట్టెనని;- మఱియొండు:- ఆశ్వయుజ శుద్ధ దశమి- యని. కాని, అ రెండవతిథి- అతఁడు నిర్వివాద వేదాంతాచార్యుఁడుగ నెలకొల్పఁబడిన సుదినమనియు, ఆనాఁడు దాని జ్ఞాపకార్థము ఉత్సవము ప్రత్యబ్దము జరుగుచుండుననియు, ఆ ప్రాంతీయుల దృఢవిశ్వాసము. కాని అతని జన్మదినమని కాదు.

అతని పుట్టుటకుముం దతని తలిదండ్రులు మిక్కిలి దీక్షతోను ఘోరనిష్ఠతోను వైదిక కర్మకలాపములను నెఱవేర్చుచుండెడివారు. శైశవమునుండియే అతఁడు అమానుష శక్తులను బ్రదర్శించెడివాఁడు. పసితనమున అతఁడు విద్యలకంటె, ఆటలను (సాముగరిడీలను) శరీరపరిశ్రమలను మిక్కిలి యిష్టపడెడివాఁడు. అతనికి మాతాపితరులు నామకరణమునాఁడు పెట్టినపేరగు 'వాసుదేవుఁ' డని కాక, అతని దేహసౌష్ఠవమునకు ముగ్ధులైన జనులు- భీముఁడని పిలిచెడివారు. అతఁడు వాయుదేవుని యపరావతారుఁ డనుప్రథ యుండినందున, 'భీముఁడు; అనుపేరు అతనియెడ సార్థకమయ్యెను. కాని, తన యవతారప్రయోజనము దేహదార్ఢ్య ప్రదర్శనము కానందున, అతనిదృష్టి తుట్టతుదకు వేదాధ్యయనము వంకకు మరలెను. అతఁడు అప్రయత్నముగను, సులభముగను, సూక్ష్మముగను వేదములన్నియు స్వల్పకాలముననే క్షుణ్ణముగ నభ్యసించెను. అతఁడంత సన్యసింప నుద్యమించి తన జననీజనకులకు నిజమనోరథమును దెలిపెను కాని వారందులకు సమ్మతింపరైరి. కడకుఁ దన యమానుష విచిత్ర కార్యములచే, వారిని దన యభిప్రాయమునకు ఉన్ముఖులను జేసికొనెను. అట్టి విచిత్రచర్యలకు సూచనములుగఁ గొన్ని ప్రత్యక్ష నిదర్శనములుగ ఆగ్రామమున ఇప్పటికిని గన్పట్టుచున్నవి. అవి వృక్షసరోవర రూపములుగ వెలయుచున్నవి. తలిదండ్రుల యనుజ్ఞ పొంద నున్నపుడతఁడు వారితో "తప్పక మీగర్భవాసమున నాకొక తమ్ముఁడు జనింపఁగలఁడు"- అని పలికెను. ఇట్లతఁడు పదునొకండవ యేటనే సన్యసించి, అచ్యుతప్రకాశరాయఁడను పరివ్రాజకునచేఁ దద్ధర్మవిధులయందుఁ బ్రబోధమందెను. సన్యాసాశ్రమము స్వీకరించిన యనంతర మతనికి 'పూర్ణప్రజ్ఞుఁడను' పేరు గలిగెను. అతఁడు చతుర్థాశ్రమ స్వీకార మొనర్చిన తరువాత వేదాంతశాస్త్రమునఁ బ్రజ్ఞ గడింప, దాని నభ్యసింప దొరకొనెను.

అతఁడు గురుముఖముగ శాస్త్రాభ్యాసము చేయు విద్యార్థి జీవితమును గడపునపుడే, తన బోధకుఁడు వివరించి చెప్పు- అంశములను ఖండించుచు దాను స్వయముగ మఱొకరీతిని వ్యాఖ్యాన మొనర్చు నంతటి తెలివి సమార్జించెను. అతఁడు విజ్ఞానభండారమను యశస్సు దక్షిణాపథమందంతట- అనతికాలమునకే వ్యాపించెను.

మధ్వాచార్యులు, తన విద్యాపరిసమాప్తి అయిన వెంటనే, అటనటఁ గల విజ్ఞుల జయించు నుద్దేశముతోఁ దాఁ దెలిసికొన్న నూత్నమతప్రచారార్థము సంచరింప సాగెను. అట్టియెడ, అతని యుద్దేశము ననుసరించి- భగవంతుని యం దచంచలభక్తి, వేదప్రామాణ్య విశ్వాసము, మాయావాదహేత్వాభాసము, సంప్రదాయోన్నతస్థాపనము- వీనిని బ్రచారము చేయుట యగును. ఒకానొకచోట అతఁడు వేదములను, మహాభారతమును, విష్ణుసహస్రనామములను- క్రమముగ మూఁడు, పది, వంద- విధముల వ్యాఖ్యానింప వచ్చునని స్థిరముగ వచించెను. అంతియకాదు. తానట్లు చేసి బుజువుపఱచి, అట సమావేశమయిన విద్వాంసుల నెల్లర నాశ్చర్యచకితుల సలిపెను. అతఁడు భగవద్గీతలకు వ్యాఖ్యానము వ్రాసి, బదరీనారాయణయాత్ర నొనర్చి, ఆగీతావివరణమునకు వేదవ్యాసుని యంగీకృతిఁ బడసెను. అప్పుడా బాదరాయణుఁడు- మధ్వాచార్యునిఁ గని, "ప్రజాసందోహము సులభముగ ఆధ్యాత్మికోన్నతిని గ్రహించునట్లు,- నీ వ్రాతలమూలమునను, ఉపదేశములమూలమును

ను నిరంతరకృషి చేయఁదగును."- అని యానతిచ్చినట్లు జగత్ప్రతీతిగలదు. పెక్కురు రాజ్యాధీశులు ఆతనికి శిష్యులయిరి. వేదవిద్యానిష్ణాతులనేకులు అతనితో వాదించి, యోడిపోయి, తద్భక్తిమతదృష్టికి 'దాసోహ'- మనిరి. అతఁడు ఎన్నియో దేవళములను గట్టించి, విగ్రహము లందు నెలకొల్పి ప్రాణప్రతిష్ఠలు చేయించెను. బదరీనారాయణ క్షేత్రమున ఆతనికి మూఁడు సాలగ్రామములను బొరాశరి యొసంగఁగా, అతఁడు వానిం గొంపోయి, సుబ్రహ్మణ్యము, ఉడిపి, మధ్యతల- అను క్షేత్రములలో నెలకొల్పి, వానికి నిత్యార్చనాదులు జరుపఁదగు- ఏర్పాటులు గావించెను. ఆచార్యులు,- మానవాతీతములు, అస్వాభావికములు అగు యోగశక్తులు గలిగియుండెను. కాని, వాని నాతఁడు కొన్ని సమయములలోనే బహిర్గత మొనరించెను. ఒకసారి ద్వారక నుండి మలబారున కొక వణిక్పుంగవుఁడు నావలోఁ బశ్చిమసముద్రతీరమందలి ఉడిపి సమీపమున- ఉన్నట్టుండి యాపడవ తలక్రిందులయ్యెను. ఆనావలో బంకమంటిముద్దతోఁ జేయఁబడిన శ్రీకృష్ణభగవానుని దివ్య సుందర విగ్రహముండెను. ఈవార్త ఆచార్యులకు అద్భుతమయిన తీరున అందుటయే తడవుగ- అతఁడటఁ జేరి, సముద్రముపాలు గాకుండ దానిం దెచ్చి ఉడిపిగుడిలో స్థాపించెను. ఆ నాఁటినుండి మధ్వమతస్థులకెల్ల ఉడిపి ఒక పుణ్యక్షేత్ర మయ్యెను. ధనవంతుఁడగు మఱొక బేహారి పడవయుఁ బ్రళయాంతకమగు తుపానునఁ జిక్కికొని, యవస్థపడుచుండ ఆచార్యు లెల్లర కచ్చెరువు గలుగునట్లు సంరక్షింపఁజాలెను. అపు డావర్తకుఁ డాతని మహచ్ఛక్తిఁ గనులారఁ గాంచి, యాతని పాదములపై వ్రాలి, తన యాస్తిలో అర్ధభాగమీయ సంకల్పించుకొనెను. అది యెఱింగి- ఆచార్యులు భగవత్ప్రేమకుఁ బాత్రుఁడగు తాను తన సర్వస్వమాయనకే సమర్పించితి ననియు, ప్రాపంచిక విషయములపైకిఁ దన మనస్సు మరల దనియు వచించెను. మధ్వాచార్యులు- ఐహిక సుఖదుఃఖములయెడ మిక్కిలి యౌదాసీన్యము గలవాఁడు. అతనికి ఉపద్రవము లెన్నియో సంభవించెను. పీడనము లెన్నియో తటస్థించెను. అతఁడు వ్రాసిన పెక్కులు గ్రంథములేకాక, అతని పుస్తకభాండాగారమందలి యపూర్వకృతులును అపహృతములయ్యెను. అంతమాత్రమున అతని మనస్సు- ఎట్టి ప్రతీకారమువంకకును మరలలేదు. వ్యాకులమునకును దావు కాలేదు. పైఁగాఁ దన కపకారము చేయఁ బూనినవారియందును అతఁ డమితాదరమునే చూపుచుండెను. ఎడవిడక అతని హృదయ మెల్లపుడును భగవంతునే అంటిపట్టుకొని యుండెడిది. దైవ సంబంధముగ బయటికిఁ జేయు కార్యములయం దతఁడు మిక్కిలి నిష్ఠతోఁ జరించువాఁడు. ఉడిపి యందు అతఁడు ఎనిమిది దేవాయతనములు నిర్మించి, అందు వెవ్వేఱు దేవతావిగ్రహములు ప్రతిష్ఠించెను. ఆచార్యులు తన యవసానము సమీపించుచుండుట నెఱింగి, తన తరువాతి మతాచార్యునిగా పద్మనాభ తీర్థుఁడను శిష్యుని సూచించి, పండుముసలితనమున 'సరిదంతర' మను ప్రదేశమున దేహమును జాలించెను.- అనంతరము మధ్వాచార్యుల యంతేవాసులును, దన్మతానుయాయులును దేశము నాలుగుచెఱగుల నసంఖ్యాక మఠములు గట్టించి, తమ గురుని మరణశాసన పూర్వకములగు ఆజ్ఞలంగ- అతని యమూల్య రచనములను గాపాడి తద్యశోలతలఁ గడలఁ బ్రాకించిరి.

## భక్తియోగముంగూర్చి, మధ్వాచార్యులు -

౧. భగవద్ధ్యానమననాదులు ఎడతెగకుండ అభ్యాసమున నుంచుకొనవలయును. ఏలయన,- అవసాన సమయమువఱకు ఏవిధమగు తెగతెంపులు లేక సాగుటకది మూలమగును. మరణ ఖేదనావస్థ సహింపరానిది; దుర్వారమయినది; దుర్భర బాధాకరమయినది. నూఱుతేళ్లు- ఒకేపర్యాయము గుట్టిన నెంత దారుణపీడ గలిగించునో- అంతకంటె నెక్కుడగు నొప్పిని ఆపాదించునది. కఫదోష మెక్కుడయి, కంఠము నిరోధించుటచే- మాట నోట రానీయదు. అట్లు రానీకపోవుటచేఁ బ్రాపంచిక విషయముల కంటిపట్టుకొన్న మనోవ్యాకులమును బయలుపఱుపనీక వ్యాకుల మాపాదించును. కాన భగవద్ధ్యాన నిరంతరాభ్యాసము తొలఁగెనేని,- జీవితము చాలించునపుడది జ్ఞప్తికి రాఁజాలదు.

౨. తప్పించుకొనరాని కర్మఫలముతే సుఖదుఃఖానుభవములు. కనుక సుఖము లనుభవించునెడ దేవుని మఱువరాదు. అట్లు విస్మరించి, దుఃఖములు ప్రాప్తించినపుడు అతనిని మరల సమీపింపఁ దలంచుట అవివేకము. వేదోక్త కర్మకలాపములను పూర్తిగ విశ్వసించి, శ్రద్ధతో నెఱవేర్పవలెను. ఏ కార్యమునకేని పూనుకొన నెంచినచో, వినీతియు సౌహార్దమును వెలయువారి ఆత్మలయందే భగవంతుఁడువసించునని

జ్ఞప్తియందు యుంచుకొన్న వ్యక్తియే మిక్కిలి మహాత్మ్యంపన్నుఁడు; ఎల్లరకును మార్గదర్శకుఁడు. ఈసృష్టి కంతటికి ఆయనయే- ఆధారము; మూలకారణము. కాన, ఏపని చేసినను, దానిఫలమంతయు ఆయనకే- సమర్పింపఁదగును. ఆయనయే దానికి అర్హుఁడు.

3. ప్రాపంచిక సమస్యలమీఁదికే- మనస్సును ప్రవేశపెట్టి, కాలమును వ్యర్థపఱుపరాదు. సంపూర్ణముగ, ఆత్మను, అంతరంగమును దేవునకే అర్పించి, ఆయనలో లీనము కావలెను. సర్వవిధముల సత్య సమ్మతములగు శ్రుతులను అనుసరించి, తత్కార్యములను నెఱవేర్చుటకంటె గొప్పది మఱొకటి లేదు. ఏలయన,- అందు చెప్పఁబడిన ఆధ్యాత్మిక రహస్యములు ఆకళించి, వానిని దైవప్రార్థనములలోఁ బ్రతిఫలింపఁ జేయుట వలన:-

౪. భగవంతుని పాదారవిందములను ధ్యానింపఁ బ్రయత్నించినంతమాత్రముననే,- పర్వతోపమముగ ఔన్నత్యముగల పాపరాశి పటాపంచలయిపోవును. అగుచో, దైవస్మరణమే నీకు మోక్షదాయి యనుట విస్పష్టము. కాన, ఆయనను జ్ఞప్తి చేసికొనకుండుట ఎంతటి అవివేకము.

౫. మిత్రులారా! మనఃపూర్వకమును, నిష్కపటమును నగు విశ్వాసము నాలకింపుఁడు. ఈ సృష్టము లన్నింటిలోను భగవంతునికిఁ దుల్యు లెవ్వరును లేరని ఇరుకేలు పైకెత్తి శపథము చేయుచున్నాను.. ఇఁక అధికులెవరు? అన్ని యంశములలోను, ఆయనయే సర్వోన్నతుఁడు.

౬. ఆయన అన్నిటిని మించిన మహోన్నతుఁడు కానిచో ఈప్రపంచమునకిఁ గ్రిందుగా నెట్లుండఁ గలదు? ఉండనిచోఁ, బ్రాణులెల్లఁ శాశ్వత మోక్షసామ్రాజ్య సౌఖ్యమందఁజాలఁడుకదా!

(సశేషము)

# సంపాదకీయములు

## విద్యార్థులు - క్రమశిక్షణ

ఈమధ్య సంఘటనల దృష్ట్యా విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యాన్నిగురించి ప్రతియొక్కరు ఆందోళనపడక తప్పడంలేదు. అయితే యిందుకు కారణములను వాస్తవిక పరిజ్ఞానంతో పరిశీలించిననే కాని పరిస్థితులు చక్కబడవు.

[illegible] విద్యాభ్యాసకాలంలో తమ బిడ్డల విద్యాభివృద్ధితో బాటు వారు సచ్ఛీలము, నియమబద్ధమైన జీవితమునకు అలవాటు పడుతున్నారా లేదాయని తల్లిదండ్రులు ఆసక్తితో గమనించుచుండవలెను. లోటుపాట్లను సవరించవలసినది విద్యాలయములే కాక తల్లిదండ్రులు సయితము శ్రద్ధవహించవలసి యున్నది. ఇది లేనిచో తమ బిడ్డల విద్యాసౌకర్యములకు ఎంత ధనము వెచ్చించినను బాధ్యతాయుతమైన జీవితవిధానము వారికలవడదు. అది భవిష్యత్తులో తమకు, దేశానికికూడ క్షేమకరం కానేరదు.

విద్యార్థులు విద్యాలయములలో నున్నంతకాలము అన్నిరంగాలకు సంబంధించిన విజ్ఞానమును సంపాదించుటకు కృషిచేయవలెను. ఆ విజ్ఞానము భవిష్యత్తులో మంచిచెడ్డలను నిర్ణయించుకోగలిగిన విచక్షణాజ్ఞానమును సమకూర్చగలిగితే జీవయాత్ర ఒడిదుడుకులు లేనిదై సాగగలదు. అంతేకాని అరకొర విజ్ఞానంతో, ఉద్రేకంతో ముందువెనుక ఆలోచన లేకుండా విద్యార్థిదశలోనే కార్యరంగంలోకి దిగితే నష్టపడేది విద్యార్థులు, దేశముకూడాను. ముఖ్యంగా రాజకీయరంగంలో విద్యార్థులు పార్టీరాజకీయాలలో పాల్గొనడంగాని, రాజకీయపార్టీలు విద్యార్థులను వినియోగించుకోడంగాని మంచిదికాదు.

అయితే ఏ దేశమైనా కల్లోల పరిస్థితులలోనుండి, దాని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రమాదావస్థలోనుండి, జాతీయ ఆదర్శలక్ష్యాల సిద్ధికి, స్వాతంత్ర్య రక్షణకు దేశంమొత్తం నడుం బిగించవలసిన అసాధారణ పరిస్థితులేర్పడితే అప్పుడు విద్యార్థులు సయితం రంగంలోకి దూకాల్సివస్తుంది. అట్టి పరిస్థితులు ఎప్పుడోకాని ఉత్పన్నముకావు.

మొత్తంమీద విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యము విశేషంగా కనుపిస్తున్నది. దాన్ని నివారించడానికి సంరక్షకుల సంఘాలు ఏర్పడి, అవి, అధ్యాపకుల పరస్పర సహకారములతో కృషిచేసి భవిష్యత్తులో తమబిడ్డల సత్ప్రవర్తన, సచ్ఛీలము, నియమబద్ధమైన జీవయాత్రల కలవడునట్లు రూపొందించవలసి యున్నది.

## పేద విద్యార్థులకు ఆర్థిక సహాయం.

ప్రతిభగల పేద విద్యార్థులకు కులమత వివక్షతలేకుండా ఇంజనీరింగ్, వైద్యంలాంటి ఉన్నత విద్యాభ్యాసమునకు ఆర్థికసహాయం చేయడానికి ప్రభుత్వము ఒక పథకం అమలుపరుస్తుందని మాజీముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డిగారు వెల్లడించారు.

ఈనాడు విద్యావిజ్ఞానములు సమానముగా నందుబాటులో నున్నవి. కొన్ని వర్గాలవారికి ప్రత్యేక అవకాశములు సయితము వారి అభివృద్ధిదృష్ట్యా యున్నవి. శక్తిసామర్థ్యాల దృష్ట్యా కులమత వివక్షతలేకుండా ప్రభుత్వ సహాయం లభించిననాడు విద్యా, ఇంజనీరింగ్ రంగాలకు ఉత్తమస్థాయి ఏర్పడి ప్రతిభ, ప్రావీణ్యములు గుర్తించబడుతవి.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.